Nabi karim (s.a.w.) ki Dawati sergermiyan aur
Hamara Mansab
(Telugu)

# దైవప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) సందేశ సరళి - మన బాధ్యత

మూలం
మతీన్ తారిఖ్ బాగ్‌పతి

అనువాదం
అబుల్ ఫౌజాన్

అనంతకరుణామయుడు అపార కృపాశీలుడైన అల్లాహ్ పేరుతో

# విశ్వప్రభువు సంప్రదాయం

మానవుడు బ్రతకటానికి, మనుగడ సాధించటానికి గాలి, నీరు,వెల్తురు, ఆహారము ఎంతో అవసరం. అందుకోసమనే దైవం భూమిపై పుష్కలంగా వీటిని ఏర్పాటు చేశాడు. అదే విధంగా మానవుని జీవితం సఫలీకృతం కావాలంటే, హితబోధ మరియు మార్గదర్శకం కూడా ఎంతో అవసరం. కనుకనే ఎంతో కనికరం, వాత్సల్యాలు గల ఆ పరాత్పరుడు, మానవుని యొక్క అతి ముఖ్యమైన ఈ అవసరాన్ని దైవదౌత్యము ద్వారాను, ప్రవక్తలను పంపటం ద్వారాను పూర్తి చేశాడు. ఆయన తన ప్రవక్తల ద్వారా, సందేశహరుల ద్వారా మానవులు సక్రమ మార్గంలో జీవితం ఎలా గడపాలో, వక్రమైన మార్గమేదో తెలియపరిచాడు. ఏ పనుల వల్ల వారి దైవం సంతృప్తి చెందుతాడో, ఏ కార్యకలాపాల ద్వారా ఆయన ఆగ్రహిస్తాడో ఇంకా ఇహలోకంలోనూ, పర లోకంలోనూ సాఫల్యం పొందటానికి అనుసరించ వలసిన మార్గమేదో కూడా ఈ ప్రవక్తలు తేటతెల్లం చేశారు.

మహనీయులైన ఇబ్రాహీం (అలై), నూహ్ (అలై), మూసా (అలై) మొదలగువారు ఈ కోవకు చెందినవారే. వీరంతా తమ తమ కాలాల్లో ప్రజ లను సన్మార్గం వైపుకు మార్గదర్శకం వహించినవారే. ప్రజలందరినీ దైవ ధర్మం వైపుకు ఆహ్వానించారు వారు. భూమ్యాకాశాలు, సూర్యచంద్రాదులు, మాన వులు పశువులు, అగ్ని, గాలి, నీరు, సముద్రాలు, ఒక్కటేమి, సర్వాన్ని ఆ దైవమే సృష్టించాడని, ఆయనే ప్రతి ఒక్కదానికి సృష్టికర్త, యజమాని అని, ఆయనే అధికారి మరియు పూజనీయుడని,ఆయనే జీవరాశిని పోషించేవాడని

ప్రజలకు తెలియపరిచారు. ప్రతిదీ ఒక నియమ నిబంధనలో బిగించబడి ఉందని, చివరికి మానవుడు జీవితం గడపడానికి కూడా ఒక నియమాన్ని, చట్టాన్ని ఆయన రూపొందించాడని తెలియజేశారు. అందుకని మానవుడు తన దైవం, సృష్టికర్త ప్రతిపాదించిన మార్గాన్నే అనుసరించాలని, మానవునికి పరమ బహిరంగ శత్రువైన షైతాన్‌ను ఎట్టి పరిస్థితిలోను అనుసరించకూడదని ప్రజలకు హితబోధ చేశారు.

## ప్రవక్తల రాక ఉద్దేశ్యం

దైవం తన సృష్టితాలపై అత్యంత దయ, కనికరాలు కలవాడు. అందుకని ఈ విశ్వంలో ఎవరినైతే తన ఉత్తరాధికారి (ప్రతినిధి)గా చేశాడో, ఆ మానవుడు పెడమార్గం పట్టి, షైతాన్ ముందు నవ్వులపాలు కావద్దనేది ఆయన అభీష్టం. అందుకోసమనే, ఎప్పుడెప్పుడైతే మానవులు పెడమార్గం పట్టి, దైవ శాసనాల్ని, నియమాల్ని ఉల్లంఘించారో, వారికి హితబోధ చెయ్యటానికి, సన్మార్గం చూపటానికి, తన అభీష్టమేదో తెలుపటానికి ఆయన తన ప్రవక్తల్ని పంపించాడు. దైవగ్రంథాలను అవతరింపజేశాడు. తద్వారా ప్రజలు దేవుని ఆదేశాలేమిటో, సన్మార్గమేదో తెలుసుకోవాలనేది ఆయన ఉద్దేశ్యం. అంతేకాదు, ప్రళయదినాన ప్రజలు దైవంపై నిందారోపణ చేస్తూ, తమకు తెలియని విషయాల గురించి సంజాయిషీ చెప్పమని అడగడమేమిటి? తాను కోరిన సన్మార్గమేదో తమకు తెలియకుండానే ఆ మార్గంపై నడువనందుకు మరియు ఇహలోక కర్మల గురించి ఓనాడు ప్రశ్నించబడుతుంది అనే విషయం తెలియజేయకుండానే మమ్మల్ని శిక్షిస్తున్నాడని ఎదురు ప్రశ్నలు వేయకుండా ఉండడానికే దైవం తన ప్రవక్తల్ని మానవజాతి వైపునకు పంపించడం జరిగింది. ఈ విషయాన్నే దివ్యఖుర్‌ఆన్‌లో దైవం ఇలా బోధించాడు.

"ఈ ప్రవక్తలందరూ శుభవార్తను తెలిపేవారుగా, హెచ్చరికచేసేవారుగా పంపబడ్డారు. వారి ఆవిర్భావం తరువాత, అల్లాహ్‌కు ప్రతికూలంగా వాదించటానికి ప్రజల వద్ద ఏ సాకూ మిగలకూడదని" (నిసా:165)

అంటే సన్మార్గమేదో ప్రజలు తెలుసుకోవాలని, మార్గవిహీనులు కాకూడదనే ఉద్దేశంతోనే ప్రవక్తలు పంపబడ్డారు. అంతేకాక ప్రళయం రోజు దైవం మానవుల కర్మల సంజాయిషి అడిగినప్పుడు, "ప్రభూ! మీరు కోరే దేమిటో, మీ అభీష్టమేదో, దేనికి మీరు సంతృప్తినొందేవారో మాకు తెలుప కుండానే మమ్మల్ని శిక్షిస్తున్నారు" అని అభ్యంతరం తెలుపకుండా ఉండేం దుకే దైవం తన అభీష్టాన్ని, తాను ఆమోదించిన సన్మార్గాన్ని ప్రవక్తల ద్వారా ప్రజలందరికి తెలియపరిచే ఏర్పాటు చేశాడు.

## దైవ దౌత్యపు బాధ్యత

దైవంచే ఎన్నుకోబడిన ఈ ప్రవక్తల రాకక్రమం ప్రతి కాలంలోను, ప్రతి దేశంలోను, ప్రతిజాతిలోను నడిచిందే. పెడమార్గం పట్టిన మానవుల్ని ఈ ప్రవక్తలు తమ దృష్టాంతాలతో, తమ మహోన్నత నడవడికలతో, తమ నిస్వార్థ ప్రేమ వాత్సల్యాలతో దైవం గురించి హెచ్చరిస్తూనే పోయారు. వారి ఆత్మల్ని మేల్కొలుప ప్రయత్నించారు. ప్రజలు తమ చెడువర్తన నుండి వైదొలగకపోతే దైవాదేశాల్ని పాటించకపోతే సంభవించబోయే భయంకర పరిణామాలేమిటో వారికి వివరించి చెప్పారు.

ఈ కార్యాన్ని పరిపూర్తి చేయుటానికే విశ్వప్రభువు చిట్టచివరిగా మహనీయ ముహమ్మద్ (సఅసం)ను, తన అంతిమ దైవప్రవక్తగా చేసి తన సందేశాన్ని మానవాళికి అందజేసేందుకు, దైవశిక్ష విరుచుకుపడక ముందే ప్రజల్ని హెచ్చరించటానికి ఉద్భవింపజేశాడు. హదీసు ఉద్గ్రంథాల్లో హజ్రత్ అబూహురేరా (రజి) ఉల్లేఖనం ప్రకారం మహాప్రవక్త ముహమ్మద్ (స) ఇలా సెలవిచ్చారు:

"నాకు మరియు ఇతర ప్రవక్తలకు సంబంధించిన సామ్యం ఎలాంటి దంటే, అత్యంత సుందరంగా ఒక మహలు నిర్మాణం జరిగింది. అయితే అందులో కేవలం ఒక ఇటుక పేర్చేటంతటి ఖాళీస్థలాన్ని వదలటం జరిగింది. చూపరులు, ఆ ఒక్క ఇటుక ఖాళీస్థలాన్ని, మిగిలిన సౌధ నిర్మాణపు సౌంద

ర్యానికి ఆశ్చర్యచకితులవుతున్నారు. కనుక ఆ ఒక్క ఇటుక ఖాళీని నేను నింపి వేశాను. ఆ విధంగా (దైవదౌత్యపు) నిర్మాణం పూర్తి అయిపోయింది. ఇక నాతో దైవప్రవక్తల పరంపర సమాప్తమైపోయింది." (బుఖారి, ముస్లిం)

## మహనీయ ముహమ్మద్ (స) ఉద్భవనానికి కారణం

మహనీయ ముహమ్మద్ (స) ఉద్భవనానికి, ప్రవక్తగా లేపబడటానికి కారణం ఏమిటంటే, మహనీయ ఏసుక్రీస్తు (అలై) తరువాత ఒక సుదీర్ఘ కాలం వరకు దైవప్రవక్త ఎవరూ పంపబడలేదు. ఇటు ప్రజలు దైవాదేశాల్లో మార్పులు చేర్పులు చేసుకున్నారు. దేవుడైతే మానవుడిని తన ఉత్తరాధికారిగా, తన ప్రతినిధిగా ఎంపిక చేసి, గౌరవోన్నతుల కిరీటాన్నితొడిగించి, ఉన్నత స్థానాన్ని ప్రసాదించాడు. అయితే మానవుడు మాత్రం తన దుర్వర్తనంతో నీచత్వపు చివరి అంచుకు చేరుకున్నాడు. తననొక్కడినే ఆరాధించాలని దైవం అతణ్ణి ఆదేశించి ఉన్నాడు. కాని అతనేమో వందలాది దైవాల ముందు శిరస్సును వంచాడు. ఒక చెట్టేమి? పుట్టేమి? రాయి, రప్ప, అగ్ని, నీరు, గాలి- అన్నీ అతని దేవుళ్ళై పోయాయి. పండితులు, పురోహితులు, పీర్లు, ఫకీర్లు, రాజులు, మహారాజులు అందరూ అతనికి దేవుళ్ళయి కూర్చున్నారు. సామాన్య ప్రజల సొమ్మును, వారి కష్టార్జితాన్ని దోచుకుంటూ వీరంతా దైవదాసుల్ని దైవమార్గం అనుసరించకుండా అడ్డుపడేవారు. అసత్యం, అశ్లీలం, దగా, మోసం, జూదం, మద్యపానం, వ్యభిచారం సర్వ సామాన్యమై పోయాయి. క్లుప్తంగా చెప్పాలంటే ప్రపంచమంతటా మానవాళి పరిస్థితి పూర్తిగా ఇలానే ఉండింది.

## అరేబియా దేశ పరిస్థితి

అరేబియా దేశ పరిస్థితి అయితే ఇంకా హీనంగా ఉండేది. అక్కడ ప్రతి వ్యక్తి అజ్ఞాని. అంతేకాదు, తమ ఈ అజ్ఞానంపై గర్వపడేవాడు కూడా. హత్యా దోపిడీలు వారికి వినోదం. అన్యాయం, అక్రమం దౌర్జన్యం వారి వృత్తి. మనిషి ప్రాణానికి వారి సమాజంలో విలువేలేదు. ఎవరిపైనైతే ఒకరికి పట్టుదొరికేదో

వాణ్ణి హతమార్చేవాడు. శత్రువులపై మెరుపుదాడులు చెయ్యడం, వారి కాళ్ళుచేతులు నరికి వేయటం, పిల్లల్ని సజీవంగా అగ్నికి ఆహుతి చేయడం వారి దృష్టిలో ఘన కార్యాలు. స్త్రీలు సైతం ఈ క్రూరత్వంలో సమానంగా పాలు పంచుకొనేవారు. వీరు మృతుల రక్తం త్రాగేవారు, వారి కాలేయాన్ని తీసి కసకస నమిలేవారు.

అశ్లీలం, వ్యభిచారం విస్తారంగా ప్రబలి ఉండేది. అసభ్యత, అశ్లీలం ఎంతగా పాతుకుపోయిందంటే, ఒకరిముందు ఇంకొకరు నిర్లజ్జగా నగ్నమై పోయేవారు. చివరికి స్త్రీలుసైతం నగ్నంగా పవిత్రకాబా గృహప్రదక్షిణం చేసే వారు. ఇవేకాకుండా మధుపానం, వ్యభిచారం, జూదం, వడ్డీ వారి దైనందిన కార్యక్రమాలు. వారిలో అజ్ఞానం, మూర్ఖత్వం ఎంతగా ప్రబలి పోయిందంటే, ఏ చెట్టు ఆకుదొరికినా, ఏ రాతిబండ దొరికినా, దాని ముందు శిరస్సు వంచడాని కూడా వెనుకాడే వారుకాదు. తమ స్వహస్తాలతో మలచబడిన విగ్రహాలను పూజించే వారు. వాటిని తమ కోరికలు ఈడేర్చమని మొక్కుకునేవారు. వాటిని దైవం కన్నా ఉన్నతమైనవిగా భావించేవారు. ఈ విగ్రహాల సంఖ్య ఎంతగా పెరిగిపోయిందంటే, కాబా గృహ గోడలు కూడా కనిపించకుండా దాగిపోయాయి.

ఇలాంటి పరిస్థితుల్లో, దైవం మహనీయ ముహమ్మద్ (స)ను ప్రపంచ మార్గదర్శకం కోసం, హితోపదేశం కోసం ప్రవక్తగా నియమించాడు. దివ్య ఖుర్ఆన్‌లో ఈ విషయం స్పష్టంగా తెలుపటం జరిగింది.

"మేము మా ప్రవక్తలను స్పష్టమైన సూచనలతో, హితోపదేశాలతో పంపాము. వారితో పాటు గ్రంథాన్ని, త్రాసునూ అవతరింపజేశాము. ప్రజలు న్యాయంపై స్థిరంగా నిలబడాలని.(అల్ హదీద్: 25)

పై ఆయత్ దృష్ట్యా, మహనీయ ముహమ్మద్ (స) ఉద్భవన లక్ష్యం ఏమిటంటే ప్రపంచంలో మానవుని వ్యక్తిగత ప్రవర్తన మరియు మానవ జీవితపు సామూహిక వ్యవస్థ, ఈ రెండూ కలిసి సమాజంలో ఎలాంటి

అన్యాయం, దౌర్జన్యానికి తావులేకుండా మనిషిని న్యాయంపై నిలబెట్ట గలగాలి. అంతేకాక ప్రతి మానవుడు దైవ హక్కులేమిటో, తన వ్యక్తిగత హక్కులేమిటో, సర్వ మానవుల హక్కులేమిటో స్పష్టంగా తెలుసుకోగలగాలి. తెలుసుకోవటమొక్కటే కాదు, తన వ్యక్తిగత మరియు సామూహిక జీవితంలో అవి ఎదురైనప్పుడు వాటిని పూర్తిన్యాయంతో నిర్వర్తించాలి. అప్పుడేగాని, పరలోక భయంకర శిక్ష నుండి తప్పించుకోజాలడు.

## దైవ సందేశ ప్రచారానికి ఆదేశం

ఇదెంత ముఖ్యమైన కార్యమంటే, పై పంక్తుల్లో వివరించినట్లు దైవం ఈ పని కోసం పదే పదే ప్రతి జాతి, ప్రతి ప్రాంతంలో తన ప్రవక్తల్ని, సందేశ వాహకుల్ని పంపిస్తూనే వచ్చాడు. ప్రజలకు ధర్మమేమిటో, అధర్మమేమిటో, సన్మార్గమేదో, పెడమార్గమేదో స్పష్టంగా, నిర్దిష్టంగా, అనుమానానికి తావు లేకుండా తేటతెల్లం చేయటమే దీని ప్రధాన లక్ష్యం. ప్రళయం రోజు సత్య సన్మార్గం తమకు తెలుపబడలేదని, అందుకే తాము పెడమార్గాల్లో కొట్టుకు పోయామని ప్రజలు దైవంతో తర్కించే అవకాశం లేకుండా చేయాలనేది దీని ప్రధానోద్దేశ్యం. ప్రవక్త దైవదౌత్యపు పదవిలోని కీలకాంశం ఇదే. అందుకనే దైవం తన దివ్యగ్రంథం ఖుర్‌ఆన్‌లో మహనీయ ముహమ్మద్ (స) ను హెచ్చరిస్తూ ఇలా ఆదేశించాడు!

> "ప్రవక్తా! నీ ప్రభువు తరపు నుండి నీపై అవతరించిన దానిని ప్రజలకు అందజెయ్యి. ఒకవేళ నీవు ఆ విధంగా చెయ్యక పోతే, ఆయన ప్రవక్తగా నీవు నీ ధర్మాన్ని నిర్వహించలేదన్నట్లే."
>
> *(అల్ మాయిదా-67)*

దీని అర్థం ఏమిటంటే, దైవం ఆయన్ను తన సత్య ధర్మ రక్షకునిగా నియమించాడు. సర్వ ప్రజలకు ఈ సత్య ధర్మాన్ని చేరవేయటం ఆయన విద్యుక్త ధర్మం, విధి, బాధ్యత. ప్రపంచంలో మంచిని వ్యాపింపజేయడం కోసం తన సర్వస్వాన్ని ధారపోయడం, శక్తి వంచన లేకుండా దీనికోసం పాటుపడటం

ఆయనకు అనివార్యంగా చేశాడు. అంతేకాక, చెడును ఎట్టి పరిస్థితిలోను బలపడనీయకుండా ఎదుర్కొనటం ఆయన విద్యుక్త ధర్మంలోని మౌలికాంశం. ఈ ప్రధాన బాధ్యతలో రవ్వంత అలసత్వం చూపినా, దైవదౌత్యపు బాధ్యతలు సంపూర్ణంగా నెరవేర్చని దాని క్రిందికే వస్తుంది.

ఈ కారణంగానే, ఆయన తన పదవి యొక్క సున్నితమైన, బృహత్తరమైన ఈ బాధ్యతను సంపూర్ణంగా గుర్తించినవారు కనుకనే ప్రవక్త మహనీయులు సందేశ ప్రచారంలో లీనమైపోయారు. ఈ కారణంగానే రాత్రిళ్ళు ఆయనకు నిదుర పట్టేదికాదు. తనపై మోపబడిన గురుతర బాధ్యతను గుర్తెరిగినవారు కనుకనే ఆయనకు ప్రశాంతత కరువైపోయింది. తన నిజప్రభువును మరిచిపోయిన ప్రపంచానికి విశ్వప్రభువు వైపుకు ఎలా మళ్ళించాలి, పెడమార్గాలపై పయనిస్తున్న మానవాళిని సన్మార్గంపై తేవటమెలా అనే ఆలోచనలే ఆయన్ను కలవర పరిచేవి. తన అంతిమ పర్యవసానాన్ని, తాము ఎదుర్కోబోయే భయంకర సన్నివేశాన్ని మరిచిపొయిన ఆదం(అలై) సంతతిని, దాన్నుండి ఎలా హెచ్చరించాలి? వినాశం వైపుకు సాగుతున్న మానవకోటిని నాశనం కాకుండా ఎలా కాపాడాలి? అనే ఆలోచనలతోనే ఆయన రాత్రింబవళ్ళు గడిచిపోయేవి.

ఇందుకోసమే, సత్య సందేశ ప్రచారాన్ని అన్ని కార్యాల కంటే ప్రధమమైనదిగా, ప్రముఖమైనదిగా భావించారు. దీని కోసమే ఆయన తన సర్వ శక్తి సామర్థ్యాన్ని వినియోగించారు. ప్రజల మనో మస్తిష్కాల్లో ఈ విషయాన్ని దృఢపరచటానికి ఆయన చేయని ప్రయత్నమంటూ లేదు. ప్రజల్ని దైవం వైపుకు మరల్చడానికి తమలోని యెగ్యతలన్నిటిని వినియేగించారు. సాధ్యమైన పద్ధతులన్నిటిని ఉపయెగించారు. వారిముందు ప్రసంగాలు చేసి, గట్టి ఆధారాలు, సముచిత దృష్టాంతాలతో 'వారు దేవుని దాసులని, బానిసలని దేవుని అభీష్టం మేరకు నడుచుకోవటమే వారి విద్యుక్త ధర్మమని, దేవుని దాస్యం ద్వారానే ఆయన ఆజ్ఞల్ని తు.చ. తప్పక పాటించటం ద్వారానే వారు సాఫల్యం పొందుతారని నొక్కిచెప్పారు. దేవుని ఆజ్ఞల్ని శిరసావహించడం,

దేవుని ముందు తలవంచటమే వారికి విజయాన్ని చేకూరుస్తుందని హిత బోధచేశారు. దీనికి భిన్నంగా తమ మనోవాంఛలకు దాసులై, తమలాంటి మానవమాత్రుల దాస్యాన్నే కనుక అవలంబిస్తే, ఏకేశ్వరున్ని విడిచి భూమ్యాకాశాల్ని, సూర్యచంద్రాదుల్ని, చెట్టుచేమల్ని, రాయిరప్పల్ని కనుక పూజిస్తే, అది మహా గొప్ప నేరంగా పరిగణింపబడుతుందని, ఇది మానవుల్ని నరకకూపంలో నెట్టేస్తుందని పదే పదే హెచ్చరిస్తూవచ్చారు.

ఈ పని ప్రారంభంలో రహస్యంగా జరిగినా, ఆ తరువాత బహిరంగంగా సందేశం ఇవ్వటం జరిగింది. ఈ కార్యసాధనలో కష్టాలు, ఆకలి దప్పికలు, అవిశ్వాసుల యాతనలు, హింసాదౌర్జన్యాలు, స్వగృహాన్ని వదలి వలస వెళ్ళటం, ఆ తరువాత యుద్ధాలు - ఈ విధంగా ప్రవక్త మహనీయులు ఎన్నో ఘట్టాలను, దశలను, బాధలను ఎదుర్కొన్నారు. ఈ సందార్భాలన్నిటిలోనూ ఆయన అత్యంత ఓర్పు సహనాలతో ముందుకు సాగుతూనేపోయారు. చివరికి ఆయన తన లక్ష్యాన్ని, తన మిషనును, సఫలీకృతం చేసి గాని విడిచి పెట్టలేదు.

## వ్యక్తిగత సంబంధాల పరిధిలో సందేశం

ప్రవక్త పదవిని చేపట్టిన తరువాత ప్రవక్త మహనీయులు (స) తన వ్యక్తిగత సంబంధాలు కలిగిన మిత్రులు, స్నేహితులు, బంధువులతో తన సందేశ ప్రచార కార్యక్రమాన్ని ప్రారంభించారని ఆయన చరిత్రను తెలిపే గ్రంథాలను అధ్యయనం చేస్తే తెలుస్తుంది. తనకు సమీపంగా, సన్నిహితంగా ఉండేవారు, తన గుణస్వభావాలను, తన అంతరంగం, బాహ్యాన్ని ఎరిగిన వారు, ఎవరైతే తనను నమ్మి విశ్వసించే వారో, అలాంటి సన్నిహితులకు ఆయన తన సత్యసందేశాన్ని గురించి తెలిపారు. ధర్మానికి సంబంధించిన మౌలిక అంశాలను వారి ముందుంచారు. మంచి చెడుల పర్యవసానాన్ని వారికి వివరించారు. తన దైవదౌత్యపు పదవి యొక్క బరువు బాధ్యతల వివరాలను వారి ముందుంచారు. ఈ కార్యక్రమం దాదాపు మూడు సంవత్స రాల

వరకు కొనసాగింది. అయితే వారిలో వేళ్ళపై లెక్కింప గలిగిన వ్యక్తులు మాత్రమే ప్రభావితులయ్యారు. కాని మక్కానగరంలోని జన సామాన్యానికి ఈ సందేశం గురించి తెలియదు. ఆ తరువాత బహిరంగంగా ఈ సందేశాన్ని ప్రజలందరికి తెలియజేయాలని దైవాదేశం వచ్చింది.

"కనుక ప్రవక్తా ! నీకు ఆజ్ఞాపించబడుతూ ఉండిన విషయాన్ని బహిరంగంగా ఎలుగెత్తిచాటు." (అల్ హిజ్ర్ : 94)

"నీదగ్గరి బంధువులను భయపెట్టు" ( అష్షూరా - 214)

దీని అర్థం ఏమిటంటే, ఏ సత్యమైతే మీకు సుబోధం చేయటం జరిగిందో, ఏ హితోపదేశం మీకు గరపటం జరిగిందో, ఏ సన్మార్గపు కాంతిని మీకు ప్రసాదించటం జరిగిందో, దాన్ని ఇతరులకు కూడా తెలుపండి. సత్య సందేశం ఇంత వరకు ఎవరికైతే చేరలేదో వారందరికి ఈ సందేశాన్నివ్వండి. మానవకోటి ఏ విషయాలనైతే మరచి పోయిందో వాటిని వారికి జ్ఞాపకం జేయండి. ఏ వాస్తవాల గురించైతే మానవ సమాజం ఏమరుపాటుగా ఉందో ఆ వాస్తవాల గురించి వారికి తెలిపి, హెచ్చరించటం మీ విధి, మీ బాధ్యత.

## బహిరంగ సందేశం

బుఖారి, ముస్లిం హదీసు గ్రంథాలననుసరించి హజ్రత్ అబ్బాస్ (రజి) ఉల్లేఖనం ప్రకారం "మీ బంధువుల్ని దైవాదేశాల గురించి హెచ్చరించండి". అనే ఆయతు అవతరించిన తరువాత ప్రవక్త మహనీయులు మక్కానగరం వెలుపల "సఫా" కొండనెక్కి ఖురైష్ తెగలను పిలిచారు."ఓ బనీఫహర్! ఓ బనీ అదీ తెగవారలారా!" అంటూ ఒక్కొక్క తెగ వారిని పేరు పేరునా పిలిచారు. చివరికి తెగలన్నీ గుమిగూడాయి. ఎవరైనా రాలేక పోతే, అతను విషయ మేమిటో తెలుసుకు రమ్మని తన తరపున ప్రతినిధిని పంపించాడు. ప్రజలందరూ వచ్చేసిన తరువాత వారిని ఉద్దేశించి మహనీయ ముహమ్మద్ (స) ఇలా అన్నారు:

"ప్రజలారా ! ఓ శత్రుసైన్యాం కొండ ఆవల మాటువేసి ఉందని, ఏ క్షణంలోనైనా అది మీపై దాడిచేయవచ్చని నేను చెబితే మీరు విశ్వసిస్తారా?" అని ప్రశ్నించారు. ప్రజలందరూ ముక్తకంఠంతో "ఎందుకు విశ్వసించం, తప్పకుండా విశ్వసిస్తాము. మీ నోటి ద్వారా సదా సత్యం తప్ప అసత్యం విని ఎరుగము" అని ప్రత్యుత్తరమిచ్చారు. దానిపై ఆయన "అయితే వినండి! నేను మిమల్ని ఒక భయంకర శిక్ష గురించి హెచ్చరిస్తున్నాను. (మీరే కనుక విశ్వసించకపోతే, ఆ భయంకర శిక్షకు గురి అయిపోతారు) మరణానంతరం మీరు దైవ సమక్షంలో హాజరు కావల్సిఉంది. అందుకని మీరు బహుదైవా రాధనను విడనాడండి."

ఇది విని అబూజహల్ తలబిరుసుతనంతో ఆవేశంగా ఇలా అన్నాడు. "ఇందుకోసమేనా నీవు మమ్మల్ని ఇక్కడ సమావేశపర్చావు?" అంటూ దురుసుగా వెళ్ళిపోయాడు. ఇతర ఖురైష్ నాయకులు కూడా ఆగ్రహంతోనే వెళ్ళిపోయారు.

నిజదైవాన్ని మరిచి పెడమార్గంపై నడుస్తున్న ప్రజానీకాన్ని దైవం వైపుకు పిలిచే సత్యసందేశపు మొట్టమొదటి పిలుపిది. ఈ పిలుపులో, ఈ సందేశంలో ఒక రకమైన శుభవార్తా ఉంది. నిరాకరించే వారి కోసం దుర్భరమైన శిక్షకు సంబంధించి హెచ్చరికా ఉంది. తానే వైపుకు పిలుస్తున్నాడో పిలిచేవానికీ తెలుసు. ఇక వినేవారు కూడా మొదటి పిలుపులోనే. దేని గురించి ప్రకటింప బడుతున్నదో బాగా అర్థం చేసుకున్నారు. అల్లాహ్ తప్ప వేరెవరూ దైవం కాదు. అనే వచనాన్ని స్వీకరించడమంటే ఏమిటో, ఏకేశ్వరుణ్ణి విశ్వసించటమంటే అర్థం ఏమిటో వారికి బాగా తెలుసు. పేదలు ధనికులు, కవులు ఉపన్యాసకులు, పాలకులు, పాలితులు, యజమాని బానిస అందరూ ఈ జన సముహంలో ఉన్నారు. ఏకేశ్వరున్ని విశ్వసించడమంటే మామూలు మాట కాదని, ఇదో కొత్త విప్లవానికి పిలుపనే విషయం వారందరికీ బాగా తెలుసు. తమ ఆలోచన, కార్యాచరణలకు కొత్త రూపమివ్వాలి. తమ ప్రాచీన, వంశ పారంపర్యమైన ఆచారాలను, ధార్మిక విశ్వాసాల్ని విడనాడి వాటి స్థానంలో ఒక కొత్త

ధర్మాన్ని, ఒక నూతన ఆలోచనా సరళిని, కొత్త నైతిక విధానాన్ని అవలం బించాల్సి ఉంటుందని, తమకు అత్యంత ప్రీతిపాత్రం, ప్రాణప్రదమైన మధు పానం, జూదం, హత్యాదోపిళ్ళను విడనాడి, సత్యసంధత, దైవభీతి, అణుకువ, వినయ వినమ్రతల్లాంటి విషయాలకు తమ జీవితాల్లో ప్రధమ స్థానం ఇవ్వాల్సి ఉంటుందనే విషయం వారెరుగంది కాదు. అంటే అసత్యాన్ని మిధ్యను విడనాడి సత్యాన్ని స్వీకరించే విషయమది. తమ అజ్ఞానం, తలబిరుసుతనం, ఇంద్రియలోలత్వం, ఇంకా తమ పూర్వీకుల అంధానుకరణ కారణంగా వారీ సందేశాన్ని స్వీకరింటానికి సిద్ధంగా లేరు. అందుకనే వారక్కడి నుండి అసంతృప్తిగా వెళ్ళి పోయారు.

కాని సత్య సందేశ ప్రచార వైతాళికుడు అధైర్యపడలేదు. ప్రజల నిర్లక్ష్య వైఖరితో ఆయన మనసు చిన్నబుచ్చుకోలేదు. మక్కానగర ప్రజలు ఇలా వెళ్ళి పోవటంతో ఆయన ఎలాంటి నిరుత్సాహం, నిరాశకు కూడా గురికాలేదు. దానికి బదులు, "దైవాదేశాల ద్వారా మీ బంధువుల్ని హెచ్చరించండి" అనే ఆయతుపై తన దృష్టిని కేంద్రీకరించారు.

## బంధువులకు ఇస్లామీయ సందేశం

పై సంఘటన జరిగిన వెంటనే ఆయన బనీహాషిం తేగకు చెందిన తన బంధువులనందర్నీ విందుకు ఆహ్వానించారు. వీరంతా దాదాపుగా నలుభై మంది వరకున్నారు. విందారగించిన తరువాత ప్రవక్త మహనీయులు (స) వారినుద్దేశించి ఇలా ప్రసంగించారు:

"చూడండి! మిరంతా కూడా నా రక్త సంబంధీకులు. నా సమీప బంధు వులు. నేనొక కొత్త ధర్మాన్ని తీసుకొచ్చాననే విషయాన్ని ఈ రోజు మీకు తెలుపు తున్నాను. ఈ ధర్మం (స్వీకరించడం) వల్ల మీకు ఇహపరాల్లో సాఫల్యం లభి స్తుంది. సర్వ అరబ్బు దేశంలో ఎవ్వరూ కూడా ఇంతకన్నా మేలైన, ఉన్నతమైన విషయాన్ని తన జాతి కోసం తెచ్చినట్లు నేనెరుగను. ఈ ధర్మ సందేశాన్ని

మీకందించాలని దైవం నన్ను ఆదేశించాడు. నాకు సహాయకారిగా మీలో ఎవరు నిలబడతారో నాకు తెలుపండి'' (ఖుత్బాతె నవీ)

ఇది విన్నంతనే సభలో నిశబ్దం ఆవరించింది. అరబ్బులోని ఇతర అవిశ్వాసుల్లాగానే, వీరుకూడా విగ్రహారాధన లాంటి మలినంలో కూరుకుపోయి ఉన్నారు. తాత తండ్రుల నుండి వంశపారంపర్యంగా వస్తున్న విశ్వాసాల నుండి లేశమాత్రమైనా కదలటానికి సంసిద్ధంగాలేరు. అందుకని ఏ ఒక్కరూ కూడా ఆయనకు సహాయకారిగా నిలబడటానికి ముందుకు రాలేదు. కేవలం పసిబాలుడు, కళ్ళకలక కారణంగా బాధపడుతున్న చిరువయస్కుడు అయిన హజ్రత్ అలీ (రజి) లేచి, ''నేను మీకు సహాయకారిగా నిలబడాతాను'' అని పలికారు.

ఇది విన్నంతనే సభికులంతా గొల్లున నవ్వేశారు. ఆ తరువాత ఏమీ చెప్పకుండానే వారంతా వెళ్ళిపోయారు.

ఈ సంఘటనపై కూడా దైవప్రవక్త మనసు చిన్న బుచ్చుకోలేదు. నిరాశ పడలేదు. సత్యసందేశ ప్రచార కార్యం సామాన్య విషయమేమీ కాదని, ఇది నిరంతర శ్రమను కోరుతుందని, ఇది అనేక రంగాల్లో సలుపవలసిన పోరని, ఇదో సుదీర్ఘ ప్రయాణమని, త్రోవలో రాళ్ళు రప్పలు, ముళ్ళ కంపలేకాదు, ఆపదల తుఫాన్లను సైతం ఎదుర్కోవాల్సి ఉంటుందని, అడు గడుగుకు ముళ్ళను, కష్టాల్ని చవిచూడవలసి వస్తుందనే విషయం ప్రవక్త మహనీయులకు బాగాతెలుసు.

మక్కాలో మహా ప్రవక్తకు ఇదే పరిస్థితులు ఎదురయ్యాయి.ఒక వైపు వందలాది దైవాలను పూజించే జాతి, వేరొక వైపు వందలాది, వేలాది దురాచారాల్లో కూరుకుపోయిన తన వంశస్తులున్నారు. ఇంకొక వైపు వడ్డీ, మధుపానాల్లో మునిగి తేలుతున్నవారున్నారు. మరోవైపు జూదం, దగా , మోసాన్ని అంటిపెట్టుకున్నవారున్నారు. ఇంకొంత మంది హింసాదౌర్జన్యాలను, హత్యాదోపిడీల్నే తమ వృత్తిగా చేసుకున్నవారున్నారు. సత్యసందేశ ప్రచారకుని

ముందున్న ప్రశ్నలల్లా, వీరందరిని ఎలా సంస్కరించాలి? వీరిని షైతాన్ వలయం నుండి బయటికి తీసి ఏకేశ్వరుని దాస్యంలోకి తేవడమెలా ? వీరిని సత్యం, న్యాయం పద్ధతులపై మళ్ళించడమెలా? అనే. ఈ ప్రశ్నలే సతతం ఆయన్ను ఆలోచింపజేసేవి. భాగస్వాములెవ్వరూ లేని ఏకప్రభువు ఆదేశం ఇది. ఆయన్ను ఈ పని కోసమే నియమించటం జరిగింది. కనుక ఆయన గారు ఎలాంటి జంకూకొంకూ లేకుండా, నిర్భయంగా, సాధ్యమైనంత మేరకు ప్రజల వరకు ఈ సందేశాన్ని చేరవేయసాగారు. ప్రజలు ఈ సందేశాన్ని ఏ విధంగా స్వీకరిస్తారు అనే దాని గురించి ఆయన పట్టించుకొనే లేదు. దీని ద్వారా కొందరు అసంతృప్తికి గురైతే కానివ్వండి, అపహాస్యం చేస్తే చేయ నీయండి, హేళనచేస్తే చేయనీయండి, శత్రుత్వం వహించినా పరవాలేదు. ఏది ఏమైనప్పటికీ తన సందేశ ప్రచారంలో వెనుకడుగు వేసేదిలేదు. దైవాభీష్ట మైనా నెరవేరుతుంది లేదా ఈ మార్గంలో తన సర్వస్థాన్ని ధారపోయటానికి కూడా మహాప్రవక్త (స) కంకణం కట్టుకున్నారు.

## కాబా గుడి ప్రాంగణంలో ఏకేశ్వరవాద ప్రకటన

మక్కానగరం చిన్నదేమీకాదనే విషయం తెలిసిందే. ధార్మిక, వాణిజ్య పరంగా అదో గొప్ప కేంద్రం. నలువైపుల్నుండి ప్రజలక్కడికివచ్చి కాబా ప్రద ర్శనం చేసుకొనేవారు. అందుకని మహాప్రవక్త (స) అక్కడికివెళ్ళి సత్య సందేశ ప్రకటన చేయటం తన విధిగా భావించారు. విగ్రహారాధకులు ఇలాంటి విషయాల గురించి అసలేం ఎరుగరు. చెవులుండీ కూడా వారు సత్య సందేశాన్ని వినగలిగిలేరు. కళ్ళుండి కూడా సత్యాన్ని చూచే యోగ్యత వారిలో లేదు. కాబా గృహ ప్రాంగణంలో ప్రతిష్ఠించిన విగ్రహాలే సర్వస్వంగా వారు విశ్వసించేవారు. గాలిని, వర్షాన్ని అవే పంపిస్తాయని. మానవులకు జీవన్మర ణాలు కూడా అవే ప్రసాదిస్తాయని, వాటి ముందు మోకరిల్లటం అందరి విధిగా వారు భావించేవారు. కాబా ప్రాంగణంలో నిలబడి ఏకేశ్వర వాదాన్ని ప్రకటిం చడం, ఏకైక దేవుని నామాన్ని ఉచ్చరించడం కన్నా పరమ అవహేళన వారి

దృష్టిలో ఇంకే ముంటుంది ? అందుకనే సత్య ప్రకటన వినగానే వారంతా ఉగ్రులైపోయారు. నలువైపుల్నుండి ఒరలో నున్న కత్తుల్ని బయటికి లాగి మహాప్రవక్త (స)పై విరుచుకుపడ్డారు. ఈ గందరగోళాన్ని విని హజ్రత్ "ఖదీజా రజి" తన జ్యేష్టపుత్రుడ్ని ఆయనకు సహాయపడమని పంపించారు. ఆయన పరుగెత్తుకుంటూ వచ్చి మహాప్రవక్త (స)కు మరియు ఈ దౌర్జన్యకారుల మధ్య నిలబడ్డారు. ఫలితంగా వారి కరవాలాల ఘతాలకు ఆయన అక్కడికక్కడే అమరగతినొందారు. కాబా గృహంలో ఇస్లాం మార్గంలో, చివరిన మొట్ట మొదటి రక్తం ఇది.

## బాధలు, సంకటాలు

దీన్ని ఒక గొప్ప ఘర్షణకు ప్రారంభ చిహ్నంగా పేర్కొనవచ్చు. సత్యా సత్యాలు పరస్పరం బాహాటంగా ఎదురుపడ్డాయి. వ్యతిరేక శక్తులు అన్ని వైపు ల్నుండి ఆయన్ను నిరోధించటానికి, అణచటానికి కంకణం కట్టు కున్నాయి. దైవప్రవక్త వారితో చెప్తున్నదేమిటి? ఈ సృష్టికి కర్త, యజమాని, ప్రభువు ఏకేశ్వరుడేనని, మనల్నందరినీ కూడా ఆయనే పుట్టించాడని, అందుకని మనమంతా కూడా ఆయన్నే ఆరాధించాలని, ఆయన ఆజ్ఞనే పాలించాలని ఆయన చూపించిన జీవన మార్గంపైనే నడవాలనే కదా! ఆయన చెప్తున్న ఈ విషయాలు ఎంతో సముచితమైనవీ, లాభదాయకమైనవీ. ఎలాంటి హెచ్చు తగ్గులు లేక మధ్యస్థంగా, పరిమితమైనవి. అంతేకాక ఆయన చేస్తున్న ఈ హిత బోధల్లో ఆయన వ్యక్తిగత, కుటుంబ, వంశ, జాతి లేక మరే విధమైన ప్రాపంచిక స్వార్ధపు ఛాయలు కూడా కనిపించేవికావు. ప్రజలు అశ్రద్ధతో ఏ వాస్తవ విషయాలను మరిచిపోయారో, వాటిని గుర్తు చేయటం, ఈ అజ్ఞానం వల్ల కలుగబోయే భయం కర పరిణామాల గురించి వారిని హెచ్చరించటమే ఆయన చేయదలిచిన పని. అంతేకాక దేనిలోనైతే వారి స్వప్రయోజనం దాగి ఉందో ఆ జీవన మార్గాన్ని అనుసరించమని బోధించేవారు. ప్రవక్త మహనీ యుల ప్రసంగాల కారణంగా ఏ మార్పులైతే సంభవించాయో, అవి కూడా

అత్యంత మెచ్చుకోదగినవిగా ఉండేవి. ఎవరైతే ఆయన గారి ఆదేశాలను శిరసావహించారో, వారి జీవితాల్లో గణనీయమైన మార్పు సంభవించింది. పూర్వంకన్నా మంచి నైతిక విలువలు గల శ్రేష్ట మానవులుగా మారిపోయారు. వారి జీవితాల్లో మేలు, శ్రేయం తొణికిసలాడసాగింది. వీటిన్నిటిని చూస్తున్న ప్పటికీ బహుదైవారాధాకులు వ్యతిరేకించటానికే నడుంబిగించారు. వారు ప్రవక్త మహనీయులను అవహేళన పాలుచేశారు. ఆయన్ను కవి, మాంత్రి కుడని పిలిచారు. ఆయన చెప్పున్న సరళ, సత్య విషయాల్ని మంత్ర ప్రభావంగా పేర్కొన్నారు. ఆయన త్రోవలో ముళ్ళు పరిచారు. రకరకాలుగా హింసించారు. హింసాదౌర్జన్యాలకు కొత్త రూపా న్నిచ్చారు. అయితే మహనీయ ముహమ్మద్ (స) మాత్రం, ఈ హింసాదౌర్జన్యా లకు తలవంచకుండా తమ వంతు పని అంటే సందేశ ప్రచారం చేస్తూనేపోయారు. ప్రతి సభలో, ప్రజల ప్రతి గుంపులో, జాతర, తీర్థాల్లో, వీధుల్లో, జాతీయ రహదారుల్లో, కాబా ప్రాంగ ణంలో క్లుప్తంగా చెప్పాలంటే ఇద్దరు, ముగ్గురు వ్యక్తులు ఎక్కడ కూడినట్లు కనబడ్డా, వారికి సత్యధర్మ సందేశ మివ్వటంలో అత్యుత్సాహాన్ని చూపేవారు. రాళ్ళు, చెట్లు, విగ్రహాల పూజ నుండి వారిని ఆపేవారు. ఏ సమయంలో కూడా ఆయన నిశ్చింతగా, తీరికగా కూర్చుండేవారు కాదు.

వాస్తవంగా మహనీయ ప్రవక్త (స) గడిపిన ఈ కాలం అత్యంత కఠిన మైనది. ఒకవైపు ఖురైష్ అవిశ్వాసులు తమకు లభించిన అన్ని వనరులతో, సాధనాలతో, ఆయుధాలతో ఈ సత్యసందేశాన్ని అణచి వేయ టానికి గట్టి ప్రయత్నాలు చేస్తున్నా, మరోవైపు దైవం తరపున నిరంతరంగా హెచ్చరికలు అవతరిస్తూనే ఉన్నాయి. దైవం తరపున ఇవ్వబడిన ఈ వ్యవధి సమాప్తమై, తన ఆదేశాలను ధిక్కరించిన జాతిని శిక్షకు గురి చేయటానికి దైవం నిర్ణయించిన ఆ అంతిమ ఘడియ ఎక్కడ వచ్చి పడుతుందోనని ప్రవక్త మహనీయులు సతతం కలతచేందేవారు. అందుకనే ఏ ఒక్క క్షణం ఆయన నిశ్చింతగా, ప్రశాంతంగా ఉండలేకపోయేవారు. ఈ కలత కారణంగానే ఈ కలవరంతోనే, ఆయన సత్యసందేశం చేరని ప్రతి చోటికి ఆత్రుతతో వెళ్ళేవారు. మక్కా, తాయిఫ్ వీధులు మొదలుకొని, మినా, అరఫాత్ మైదానాల వరకు, బంధు

మిత్రులు మొదలుకొని హజ్ యాత్ర కోసం అరబ్బు వివిధ ప్రాంతాల నుండి వచ్చిన విభిన్న తెగల ప్రజల వరకు ఈ సత్యసందేశాన్ని చేరవేశారు. ప్రతి ఒక్కరిని ఈ సన్మార్గం వైపుకు ఆహ్వానించారు.

## కష్టాలు, కడగండ్ల కాలం

ఆనాటి మక్కా ప్రజల మనోమస్తిష్కాలు ఎంత వక్రంగా, ఎంత కఠినంగా మారిపోయాయంటే, వారు మహనీయ ముహమ్మద్ (స) మాటలు కూడా వినడానికి సిద్ధంగా లేరు. కరడుగట్టిన పక్షపాతం, ఇంద్రియ లోలత్వంలో మునిగిపోయిన కారణంగా ఆయన్ను (స) వ్యతిరేకించటం తప్ప వారికి ఇంకేదీ తోచేదికాదు. ఈ కారణంగానే ఆయన, ఆయన అనుచరులు తీవ్రయాతనలకు గురికావలసి వచ్చింది. ఈ కాలం ఆయనపై ఆయన అనుచరులపై అత్యంత కఠనంగా గడిచింది. పాషాణ హృదయులైన ఈ అవిశ్వాసులు, సత్యధర్మాన్ని అవలంబించిన ఆయన అనుచరుల పట్ల అత్యంత అమానుషంగా ప్రవర్తించారు. వారిని పగటిపూట కాలిపోతున్న ఎడారి ఇసుకపై పడుకోబెట్టి ఈడ్చారు. అగ్ని కణాలపై పరుండ బెట్టారు, కదలకుండా పైనొక మనిషిని నిలబెట్టారు. చివరికి చర్మం కాలిపోయి, లోపలి కొవ్వు సైతం కరిగి బయటికి వచ్చేది. చివరికి ఇల్లు వాకిలి, సర్వస్వాన్ని వదలి వేరే ప్రాంతాలకు వలస వెళ్ళటానికి కూడా వివశులుగా చేశారు. అయితే ఇస్లాం అనుయాయులు ఇంతటి భయనక బాధల్ని భరిస్తూ కూడా వెనుకంజ వేయ లేదు. చిరునవ్వుతో గాయాలపై గాయాలనెదుర్కొన్నారు, దైవ మార్గంలో తమకు అమూల్య మైన ప్రతి దానిని కోల్పోయారు. కాని వెనుకంజ వేయడానికి, సత్యధర్మాన్ని విడనాడడానికి ఆలోచించనైనా ఆలోచించలేదు. ఇన్ని బాధలు, కష్టాలను అధిగమిస్తూనే ముందుకు పురోగమించసాగారు.

## ఆశ, ప్రలోభాలు

సత్యసందేశ మార్గంలో కేవలం యాతనలు, కష్ట దుఃఖాలు మాత్రమే రావు. కొన్ని సందర్భాల్లో సుందరమైన, మనోజ్ఞమైన ఆశల, ప్రలోభాల బంగారు

వలలు కూడా ఎదురవుతాయి. సత్యధర్మప్రచారకుని నోరు మూయించడానికి అమానుషకిరాతాక హింసలేకాదు, కనకాంబరాలు, కిరీటాలు, సింహాసనాలు కూడా సమర్పించబడతాయి. కఠిన శిక్షలు, ఘోరమైన హింసలతో కూడా సత్య పిపాసిని అణచటం సాధ్యం కాకపోతే, కనక వర్షం కురిపించి కూడా అతనిని లోంగదీసుకోవాలని ప్రయత్నిస్తుంటారు. ఈ వ్యతిరేకులు అప్సరస ల్లాంటి సుందరీమణుల్ని కానుకలుగా సమర్పిస్తారు. కాని ఎవరయితే ప్రపంచం కన్నా దైవధర్మాన్నే అధికంగా ప్రేమిస్తారో, తమ మానసిక ఇచ్చా కోరికల కన్నా దైవప్రసన్నతనే అత్యధికంగా అభిమానిస్తారో, ఇహలోక జీవితం కంటే మరణం, మరణానంతర జీవితంపై ఎవరికయితే అత్యధిక విశ్వాస ముంటుందో, అలాంటి వారు ఈ జీవితాన్ని ఈ జీవిత సౌఖ్యాల్ని, ఇక్కడి ధన కనక వస్తు వాహనాదులను, రాజ్యాధికారాన్ని కూడా త్రుణప్రాయంగా భావించి బేఖాతరు చేస్తారు.

ఇలా హింసాదౌర్జన్యాలతో దైవప్రవక్తను ఓడించలేక పోయిన ఖురైష్ నాయకులు ఎంతో కలవరపడ్డారు. అయన్ను నచ్చజెప్పటానికి, ప్రలోభాల వలలో వేసుకోవటానికి ఉత్బా అనే నాయకుణ్ణి మహాప్రవక్త (స) వద్దకు పంపారు. అతను అపార ధనరాసుల్ని అరబ్బులోకెల్ల సౌందర్యవతులైన కన్యల్ని, అరబ్బుదేశ రాజ్యాధికారాన్ని మహాప్రవక్తకు ప్రతిఫలంగా సమర్పిస్తామని ఆశ జూపుతూ ఇలా విన్నవించాడు. "నాయనా ముహమ్మద్ ! మేము మా సర్వ సిరిసంపదల్ని, గౌరవప్రతిష్టల్ని నీకు సమర్పించుకుంటాము. అయితే ఓ షరతు. మేము పూజించే విగ్రహాలను విమర్షించకు అంతే! అనగా ప్రవక్త మహనీయులు దివ్యఖుర్ఆన్‌లోని హామ్మీమ్ సూరాలోని కొన్ని ఆయతులు మాత్రమే పఠించేసరికి ఉత్బా కంపించిపోయి, ఇంకా పఠించకుండా ఆయన నోటిపై తన చేతినుంచాడు. అక్కడి నుండి లేచి, ఖురైష్ నాయకుల వద్దకు వచ్చి ఇలా అన్నాడు:

"ఖురైష్ నాయకుల్లారా! ముహమ్మద్ వద్ద ఏ దివ్యావిష్కృతి అయిన ఖుర్ఆన్ ఉందో, దైవసాక్షిగా చెబుతున్నాను, అది కవిత్వమూ కాదు

మంత్రమూ కాదు వాటి కతీతమైనది. అందుకని మీరు అతనికి తగలకండి. ఒకవేళ అతను అరేబియానంతటిని వశపరుచుకుంటే, అందులో మీకు గౌరవం ఉంది. అలా కాకపోతే అరబ్బులే అతన్ని సమాప్తం చేసేస్తారు."

సత్యం కాంతి మిథ్యాచీకట్లకు ఎన్నడూ ఓడిపోదు. వ్యతిరేకుని నోటితో కూడా యదార్థం పలికించే సత్తా సత్యానికుంది. సంకల్పబలం తనలో అత్యంత శక్తిని కలిగి ఉంటుంది. వైరులు సైతం దీన్ని పొగడకుండా ఉండలేరు. అదే జరిగింది ఉత్బా పట్ల. మహనీయ ముహమ్మద్ (స) వజ్రసంకల్పాన్ని, అపురూపమైనది, అసామాన్యమైనదీ అయిన దివ్యావిష్కృతి ఖుర్‌ఆన్ వాణిని విన్నంతనే ఉత్బా కళ్ళపై పడిన తెరలు తొలగిపోయాయి. అందుకే అతను తన జాతి నాయకుల్ని ఉద్దేశించి 'ముహమ్మద్ లక్ష్యం ధనకనకాంబరాలు, ప్రభుత్వమూ, రాజ్యము, రాజ్యాధికారం కాదని, ఇవన్నీ కూడా ఆయన ముందు విలువ లేనివని, ఆయన చెప్పేదంతా కేవలం మన శ్రేయాన్ని ఆకాంక్షించే చెప్తున్నారని తెలిపాడు. అయితే ఉత్బా హితబోధ వారి చెవికెక్క లేదు. షైతాన్ ప్రబోధంతో వారు ఇంకొక ఎత్తుగడ వేశారు.

## పిన తండ్రి అబూతాలిబ్‌కు ఫిర్యాదు

అన్ని తెగల నాయకులు కలిసి, అబూతాలిబ్ దగ్గరికొచ్చారు. "చూడండి! ఇంతవరకు కూడా మేము మిమ్మల్ని అత్యంతగా గౌరవించాము. మీ కుమారుడు మా విగ్రహాలను తూలనాడుతున్నాడు. మా ధర్మంలో లోపాల్ని ఎంచుతున్నాడు. తాత తండ్రుల్ని మార్గవిహీనులుగా భావిస్తున్నాడు. ఇక మేము సహించలేము. అందుకని మీరతన్ని మా మతాన్ని తప్పు పట్టవద్దని, మా ఆచారాలను విమర్శించవద్దని గట్టిగా మందలించి నోరు మూసుకొమ్మని ఆదేశించండి. అలాకాని పక్షంలో ఇక మీరో,మేమో తేల్చుకోవాల్సి ఉంటుంది."

వారంతా వెళ్ళిపోయిన తరువాత పిన తండ్రి అబూతాలిబ్ ప్రవక్త మహనీయుల వద్దకు వచ్చి ఇలా అన్నారు: 'నాయనా ముహమ్మద్! నేను మోయలేనంత భారాన్ని నాపై మోపకు తండ్రీ!'

పరిస్థితి అత్యంత సున్నితంగా మారింది. ఒకవైపు పినతండ్రి ప్రేమ, ఆయన గౌరవప్రతిష్టలు మంటగలిసే ప్రమాదం! సర్వ మక్కా వాసులు ఆయనకు వ్యతిరేకులయ్యే ప్రమాదం.!! వేరొకవైపు విశ్వాస పరిరక్షణ! దీని వెనుక దైవప్రసన్నత, దైవాభీష్టం! అంతేకాక ప్రళయం రోజు దీని గురించి ఇవ్వాల్సిన సంజాయిషి. దీన్ని దృష్టిలో పెట్టుకుంటే నిరంతర కృషిని కొనసాగనివ్వాలి, తన శరీరంలోని చివరి రక్తపు బొట్టు వరకు ఈ కర్తవ్యాన్ని నెరవేర్చవలసి ఉంటుంది. సత్యాన్ని పరిపూర్ణంగా స్థాపించడానికి తమకు తాముగా వారికి అర్పించుకోక తప్పదు. దైవప్రసన్నతే ఒక విశ్వాసి జీవితం యొక్క పరమ లక్ష్యం. అతని ప్రథమ, చివరి ఆకాంక్ష అదే. అందుకనే ప్రవక్త మహనీయులు (స) కృతనిశ్చయంతో,తన పినతండ్రికి ఇలా సమాధాన మిచ్చారు:

"బాబాయి! దైవసాక్షిగా చెబుతున్నాను! వీరు నా కుడిచేతిలో సూర్యుడ్ని, ఎడమచేతిలో చంద్రున్ని తెచ్చిపెట్టి, ఈ మహాకార్యాన్ని మానుకో మన్నా అది జరిగే పనికాదు. ఈ మహాకార్యంలో దైవం నాకు సంపూర్ణ సాఫల్యాన్నైనా ప్రసాదించాలి లేదా ఈ మార్గంలో నా ప్రాణం అయినా పోవాలి."

ఇదో విచిత్రమైన వజ్రసంకల్పం, అకుంఠిత కార్యదీక్ష, మిథ్యా శక్తులకు వ్యతిరేకంగా బహిరంగ యుద్ధ ప్రకటన లాంటిది. దీని అర్థం ఏమిటంటే, ఎవరైతే దైవాలై కూర్చున్నారో, వారంతా మొసగాళ్ళు, కపటులు.మానవుడు దైవాన్ని కాదని, వేరే వస్తువునైనా, వేరెవరినైనా దైవంగా చేసుకున్నాడంటే, వాటికి అర్హతలేని స్థానాన్ని ప్రతిపాదించాడన్న మాట. ఈ సర్వ విశ్వానికి ఉన్నది కేవలం ఒక దేవుడు. మిగతావన్నీ ఆయన సృష్టితాలే. విశ్వప్రభువు, సృష్టికర్త అయిన ఆ ఏకేశ్వర్ణి ఆరాధించడమే మానవునికి సక్రమమైన మార్గం. దేవుళ్ళ సమూహాన్ని సమాప్తం చేయటమే ఒక విశ్వాసి కర్తవ్యం. ఈ కార్యసాధనలో ప్రాణం పోయినా పరవాలేదు.

## వ్యతిరేకతల నేపథ్యం

ఇకిప్పుడు విషయం తేటతెల్లమైపోయింది. చెప్పించడం వల్ల, నచ్చజెప్పటం వల్ల ఒనగూడేది ఏదీలేదనే విషయం ఖురైష్ నాయకులకు

బోధపడింది. అందుకని కఠిన చర్యలు గైకొనక తప్పదు. మంకుపట్టుకు చికిత్స హింసకాక మరేముంటుంది? వాస్తవానికి ఇస్లామీయ సందేశ ప్రచారం ప్రారంభం కాగానే దైవప్రవక్త కందిరీగల తెట్టెను కదిలించినట్లయింది. ఇక ఆయన సందేశం వ్యాప్తి చెందే కొద్దీ, అవిశ్వాసుల వ్యతిరేకత మరీ తీవ్రం కాసాగింది. అయితే ఆయన్ను నచ్చజెప్పి, ప్రలోభపరిచి ఈ కార్యం నుండి మరల్చవచ్చనే ఆశ ఉన్నంతవరకు వారు కాస్త సంయమనం పాటించారు. కాని ఎప్పుడైతే ప్రవక్త మహనీయులు వారి ఈ ఆశను కూడా వమ్ముచేసేశారో మరియు ఆయన ధార్మిక విషయంలో వారితో రాజీపడే ప్రసక్తేలేదని సంపూర్ణంగా ఎప్పుడైతే వారికి తెలిసి వచ్చిందో, వారి శతృత్వం కూడా శిఖరాగ్రాన్ని అందుకుంది.

ప్రత్యేకించి, ఏ కుటుంబాల్లోనైతే ఒకరిద్దరు ఇస్లామీయ ధర్మాన్ని స్వీకరించారో, ఆ కుటుంబాల వారికి మహాప్రవక్త (స) పట్ల ద్వేషం పెల్లుబుకసాగింది. వారు రకరకాలుగా ఆయన్ను తూలనాడేవారు. చీకటిమాటున రాత్రి పూట దాగుండి అకస్మాత్తుగా ఆయన్ను హతమార్చిస్తే, హంతకులెవరనే విషయం బనీహాషం తెగవాళ్ళు తెలుసుకోలేరని అలాంటి పన్నాగాలు పన్నటం మొదలెట్టారు. ఆయన చనిపోవాలని లేక తీవ్రంగా జబ్బుపడాలని లేక ఆయనకు పిచ్చిపట్టాలని మంత్ర తంత్రాల్ని కూడా ఆశ్రయించారు. దుర్మార్గులైన షైతాన్ అనుచరులు, నలువైపులా వ్యాపించి అమాయక ప్రజలకు ప్రవక్త (స) పట్ల, ఆయన తెచ్చిన ధర్మంపట్ల, ఆయనపై అవతరిస్తున్న దివ్యావిష్కృతి ఖుర్‌ఆన్ పట్ల రకరకాల అనుమానాలు రేకెత్తించి, ప్రజల్ని ఆయనంటే భీతావహులుగా చేయనారంభించారు. అనేక మంది నాయకులు అసూయ ద్వేషాలకు లోనయ్యారు. వారికి ఇతరులకు లభించే గౌరవోన్నతులను చూచి భరించే శక్తిలేదు. ఉదాహరణకు అబూజహల్ అనే ఖురైష్ నాయకుడు ప్రవక్త మహనీయుల పట్ల వ్యతిరేకతలో అతికి పాల్పడ్డాడు. దీనికి కారణం ఏమిటో అతను స్వయంగా ఇలా వివరిస్తున్నాడు:

"మా వంశం మరియు బనీ అబ్దెమునాఫ్ (దైవప్రవక్త వంశం) సమ ఉజ్జీలుగా ఉండేవి. వారు ప్రజలకు భోజనాలు పెడ్తే, మేమూ పెట్టించాము. ప్రజలకు వారు స్వారీలను సమకూరుస్తే మేమూ సమకూర్చాము. ప్రజలకు వారు కానుకలు ఇస్తే, మేమూ ఇచ్చాము. చివరికి గౌరవోన్నతులలో, మారెండు వంశాలు సమానమైపోయినప్పుడు, మాలో ఒక ప్రవక్త ఉద్భవించా డని, అతనిపై దైవవాణి అవతరిస్తుందని వారు సవాలు విసిరారు. అలాం టప్పుడు మేమీరంగంలో వారితో ఎలా సరితూగ గలం? ఎలా పోటీపడ గలుగు తాము? దైవసాక్షి! మేము అతణ్ణి అస్సలే ఒప్పుకోము. అతను దైవప్రవక్త" అని రూఢిపరచం. (ఇబ్నె హిషాం -సంపుటం-1, పేజి-330)

## హింసాదౌర్జన్యాల పరంపరలు

అందుకని మంకుపట్టు, ద్వేషం, హింసాదౌర్జన్యాలతో కూడిన ఒక కొత్త యుద్ధనీతి ప్రారంభమయింది. మహాప్రవక్త (స)ను, ఆయన అనుచరుల్ని రకరకాల హింసాదౌర్జన్యాలకు గురిచేయసాగారు. బుఖారి హదీసు గ్రంథాన్ని అనుసరించి, హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) కథనంలో ఈ విధంగా వివరించటం జరిగింది.

"ఒకసారి మహనీయ ముహమ్మద్ (స) కాబా దైవగృహంలో నమాజు సలుపుతున్నారు. అబూజహల్ ఆదేశానుసారం ఉత్బా అనే వ్యక్తి, మహాప్రవక్త (స) సజ్దా చేస్తున్న స్థితిలో, ఆయన వీపుపై (బరువైన) ఒంటెపొట్ట ప్రేగుల్ని తెచ్చిపెట్టేశాడు. ఆ తరువాత వారు విరగబడి నవ్వసాగారు. ఈ కబురు అంద గానే హజ్రత్ ఫాతిమా (రజి) పరుగెత్తుకుంటూ వచ్చి ఈ మలినాన్ని తొలి గించారు."

ఇంకొక కథనంలో ఇలా ఉంది.

"శ్వాస పీల్చటం కూడా కష్టతరమైపోయినంతగా హింసాదౌర్జన్యాల పరంపరలు మొదలయ్యాయి. వారు ఆయన్న (స) అవహేళన చేసేవారు, చప్పట్లు చరిచేవారు, ఆయన్ను చూడగానే ముఖాలు తిప్పుకునే వారు, లేదా

ఆయనకు ఎదురు పడకూడదని. గుడ్డతో తమ ముఖాల్ని దాచేసుకొనేవారు, తత్ఫలితంగా ఆయన తమతో మాట్లాడ కూడదనేది వారి ఉద్దేశం. ఇంతవరకే కాదు, దీన్ని అధిగమించి ఆయనపై చెత్త, కసవుపొసేవారు, ఆయన వెళ్ళే మార్గంలో ముళ్ళుపరిచేవారు, ఇదంతా జరిగినా ఆయన గారు నిర్వీరామంగా తన పనిచేసుకుంటునేపోయారు. ఎవ్వరాపినా కూడా తన కార్యం నుండి వైదొలిగే వారు కాదు, అవహేళన, పరిహాసాన్ని పట్టించుకొనే వారు కాదు."

ఒక వ్యక్తి ఇలా వర్ణిస్తున్నాడు.

"నేనొకసారి "జిల్ మజాజ్" సంతలో దైవప్రవక్తను అరబ్బుతెగల్లో ఇస్లాం సందేశాన్ని ప్రచారం చేస్తూ చూశాను. ఆయనిలా ఉపదేశిస్తూ అన్నారు:

"ప్రజలారా ! అల్లాహ్‌ను విశ్వసించండి, సాఫల్యం పొందుతారు" ఇంకా పొడువాటి వెంట్రుకలున్న ఒక వ్యక్తి ఆయన్ను రాళ్ళతో కొడ్తూ ఇలా చెప్పు కుంటూ పోతున్నాడు. "ప్రజలారా! ఇతని మాట వినకండి. ఇతను అసత్య వాది." నేను ఈయనగారి గురించి ఆయన ఎవరు? అని అడిగితే ఆయన అబ్దుల్ ముత్తలిబ్ కుమారుడని సమాధానమిచ్చారు. రాళ్ళతో ఆయన గారిని కొడ్తున్న ఆ రెండవ వ్యక్తి ఎవరని అడిగితే అతను ఆయనకు బాబాయి, పేరు అబూజహల్ అని సమాధానం లభించింది. ఇది అత్యంత క్లిష్టమైన సన్నివేశం. దీనితో ప్రజలు బాగా ప్రభావితమయ్యేవారు, "ఇంటివాళ్ళే ఆయన మాటను విశ్వసించ నప్పుడు మరి మనమెందుకు విశ్వసించాలి" అని చెప్పుకునే వారు.

ఇంకొక సంఘటన ప్రముఖమైంది. దీన్ని ప్రవక్తగారి జీవిత చరిత్ర గ్రంథాల్లో పేర్కొనటం జరిగింది.

ఒకరోజు దైవప్రవక్త సఫా గుట్టపై కూర్చొని ఉన్నారు. అంతలోనే అబూ జహల్ అక్కడికి వచ్చాడు. రాగానే ఆయన్ను తూలనాడాడు. అంతేకాక చేతిలో నున్న బండను దైవప్రవక్త తలపై విసిరాడు. అది తలకు బలంగా తగిలి రక్తం ప్రవహించసాగింది. ఆయన పినతండ్రి అయిన హమ్జా (రజి)కు ఈ సంఘటన గురించి తెలిసింది. అంతవరకు ఆయన ఇస్లాంను స్వీకరించి ఉండలేదు. కాని

(దగ్గరి) బంధుత్వం కారణంగా ఆయన మండిపడ్డారు. సరాసరి అబూ జహల్‌ను సమీపించి, ఖురైష్ నాయకుల సమూహంలో కూర్చున్న అబూ జహల్ తలపై తన ధనుస్సుతో బలంగా కొట్టారు. ఫలితంగా అతను గాయ పడ్డాడు. ఆ తరువాత ఈ శుభవార్తను వినిపించటానికి దైవప్రవక్త వద్దకెళ్ళి 'కుమారా! అబూ జహల్‌తో నీ ప్రతీకారం తీర్చుకున్నానని తెలిస్తే నీవు సంతోష పడతావనుకుంటున్నాను" అని చెప్పారు. దానిపై దైవప్రవక్త "బాబాయ్! దీనితో నాకెలాటి సంతోషం కలుగదు. దానికి బదులు మీరు ఇస్లామే గనుక స్వీకరించి ఉంటే నేను ఎంతో సంతోషించేవాణ్ణి, అని బదు లిచ్చారు. ఆయన గారు ప్రద ర్శించిన ఈ నిస్వార్థత, సత్యసంధతను చూసి, హజ్రత్ హమ్జా(రజి)లో నిద్రా వస్థలోనున్న నైజం (మానవత్వం) మేల్కొంది. వెంటనే ఆయన ఇస్లాం స్వీకరిం చారు.

## నిర్బంధాలు, సామాజిక బహిష్కరణల యాతనలు

తాము ఎంతగా ప్రయత్నించినా, ఇస్లాం వ్యాప్తిని అరికట్టలేక పోతున్నా మనే ఉక్రోషంతో, తెగలన్నీ కలిసి ఒక ఒప్పందం చేసుకున్నాయి. దానినను సరించి మక్కానగర వాసులందరూ బనీహాషిం తెగవారితోను, ముస్లింలంద రితోను సంబంధాలన్ని తెగదెంపులు చేసుకోవాలి. వారికి ఒక్క వస్తువు కూడా అమ్మరాదు, ఆహార పదార్థాలను వారికి చేరనివ్వరాదు, ఈ ఒప్పందాన్ని వ్రాసుకొని, కాబా గృహ గోడకు వ్రేలాడదీశారు.

దీని ఫలితంగా అబూతాలిబ్ యొక్క మొత్తం కుటుంబంపై అనంత కష్టాల మేఘాలు కమ్ముకున్నాయి. వారు నిస్సహాయులుగా మారిపొయారు. గత్యంతరం లేక కుటుంబ సభ్యులనందరిని తీసుకొని, ఘాబె అబితాలిబ్‌గా పిలువబడే ఒక కొండ లోయలో సాంఘిక నిర్బంధానికి లోనయ్యారు. తినటానికి పనికొచ్చే ఏ ఒక్క పదార్థం కూడా వారికి చేరకుండా ఈ ముష్కరులు కట్టుదిట్టమైన కాపలా ఏర్పాటు చేశారు. ఈ నిర్బంధం ఒకటి రెండు రోజులు కాదు, మొత్తం మూడు సంవత్సరాల వరకు కొనసాగింది. ఈ కాలంలో ప్రవక్త

మహనీయులు, ఆయన కుటుంబ సభ్యుల కష్టాలు వర్ణణాతీతం. ఆకలి దప్పికల్ని తట్టుకోలేక, ఈ కుటుంబీకులు గడ్డిని, చెట్ల ఆకులలము తిన వలసిన పరిస్థితి ఏర్పడింది. పసి పిల్లలు ఆకలి, దప్పికల బాధతో రోదిస్తూ ఉంటే వారి ఏడ్పులు లోయ బయటి వరకు కూడా వినిపించేవి. ఆకలిని తట్టుకోలేక చెట్ల ఆకుల్ని చెట్ల చెక్క, బెరడుల్ని సైతం తినేవారమని, అది కూడా అయిపోయిన తరువాత, నాకొక తోలు ముక్క దొరికిందని, దాన్ని బాగా కడిగి కాల్చి తిన్నానని, ఈ విధంగా అసహజమైన ఇలాటి పదార్థాలు తినటం వల్ల తమ నోర్లు పూశిపోయాయని హజ్రత్ సఅద్(రజి) చెప్పడం జరిగింది.

(తహ్జీబుల్ అస్మా)

మక్కా ఖురైషీయులు, తమను ఇన్ని యాతనలకు గురిచేసినప్పటికి, ప్రవక్త మహనీయులు ఎడతెగకుండా వారికి ఇస్లామీయ సందేశ బోధన చేస్తూనే ఉన్నారు. దైవమార్గంలో ఎన్ని కష్టనష్టాలు వచ్చినా, ఎన్ని బాధల్ని ఎదు ర్కొన్నా, ఆయన అకుంఠిత దీక్షలో లేశమంత బలహీనత కూడా రాలేదు. చివరికి గతిలేక ఈ అవిశ్వాసులు స్వయంగానే ఈ ఒప్పందాన్ని రద్దు పరిచారు. లోయపై పెట్టిన కాపలాను తీసివేశారు. అప్పుడుగాని బనీ హాషిం సంతతి వాళ్ళు సామాజిక బహిష్కరణ నుండి బయటపడలేదు.

## హజ్ సమయంలో వివిధ తెగల్లో ప్రచారం

ప్రవక్త మహనీయులను దైవం తన ప్రవక్తగా, సత్య సందేశ ప్రచార కునిగా నియమించి పంపించాడు. కనుక ఎవరివరకైతే సత్యసందేశం చేరలేదో లేక ఎవరైతే దైవదాసులై ఉండి కూడా దైవాన్ని విస్మరించారో, వారందరి వరకు దైవసందేశాన్ని చేరవేయటం ఆయన విధి, బాధ్యతగా నిర్ణయించబడింది. ఈ కారణంగానే పర్వతలోయ నిర్బంధంనుండి బయటపడగానే ఆయన తన సందేశ ప్రచారాన్ని ముమ్మరం చేశారు. చుట్టుప్రక్కల వ్యాపించి ఉన్న తెగ ల్లోని ప్రజలకు దీన్ని చేరవేయడం ఎంతో ముఖ్యమని భావించారు. దీని కోసం హజ్ సమావేశం ఎంతో ఉపయుక్తమైనది. ఈ సమయంలో చుట్టు పట్ల తెగల

ప్రజలు హజ్ యాత్ర కోసం మక్కాకు వచ్చేవారు. ఈ సందర్భాన్ని సద్వినియోగం చేసుకోవాలనే తపనతో మహాప్రవక్త (స), వారు విడిదిచేసిన గుడారాలకు, ఇండ్లకు ప్రత్యేకంగా వెళ్ళి వారిని కలుసుకొనేవారు. దైవం ఉపదేశించిన విషయాల్ని వారికి తెలియజేసేవారు.

## ప్రచార నిమిత్తం ప్రయాణాలు

సత్యసందేశ కార్యం పరిమితమైనదేమీకాదు, అత్యంత సువిశాలమైనది. సత్యసందేశాన్ని, దైవాదేశాల్ని తమ సమీప బంధువులకు వినిపించాలి. వారు పట్టించుకున్నా, పట్టించుకోకపోయినా సరే. ఆ తరువాత దాన్ని బయటి ప్రజలకు చేరవేయాలి. తమ నగరం, ఆ తరువాత పరిసర గ్రామాలు, నగరాలు ఆ తరువాత పరిసర దేశాలకు సైతం ఈ సందేశాన్ని వినిపించడం ఒక విశ్వాసి బాధ్యత. దైవప్రవక్త ఈ లక్ష్యంతోనే మక్కా బయటి ప్రదేశాలకు వెళ్ళారు. తాయిఫ్ నగర ప్రయాణం అందులో ప్రఖ్యాతిగాంచింది.

## తాయిఫ్ ప్రజలకు ఇస్లామీయ సందేశం

తాయిఫ్ నగరం మక్కాకు కొంచెం దూరంలో ఉన్న ఒక సంపన్నమైన బస్తీ, అక్కడి ప్రజలు ఎంతో ధనవంతులు. సారవంతమైన భూములు, మైళ్ళ వరకు వ్యాపించి ఉన్న పళ్ళతోటల్ని కలిగినవారు. తాయిఫ్‌కు చెందిన కొందరైనా నాయకులు ఇస్లాంను అవలంబిస్తే, అది ఇస్లామీయ ఉద్యమానికి ఎంతో దోహదపడుతుందని మహాప్రవక్త భావించారు. అయితే తాయిఫ్ వారు, మక్కా వాసులకన్నా పాషాణ హృదయులని తెలిసిపోయింది. వారు ధన మధాంధకారంతో తాముతప్ప మిగిలిన వారందరిని హీనులుగా చూచేవారు. తమ పెడ మార్గంలో, అనైతికతల్లో పీకల వరకు కూరుకుపోయినవారు.

ప్రారంభంలో వారు ప్రవక్త సందేశానికి ఎగతాళి చేస్తూ సమాధానమిచ్చారు. ఆ తరువాత తుంటరి మూకల్ని, రౌడీలను ఆయనపై ఉసిగొల్పారు. అందువల్ల ఆ తుంటరి మూకలు క్రూరమృగాల్లా ఆయన గారిపై

విరుచుకుపడ్డాయి. ఈ నిర్దయులు ఆయన్ను రాళ్ళతో కొట్టసాగారు. గురిపెట్టి మరీ కొట్టటం వల్ల రక్తపు ధారలు ప్రవహించసాగాయి. ఆయన గారు అలిసి పోయి ఎక్కడైనా కూర్చుంటే, ఈ దుండగులు ఆయన్ను లేపి, నిలబెట్టి మరీ ఆయనపై రాళ్ళ వర్షం కురిపించేవారు. ఈ కిరాతకం ఎన్నో గంటల వరకు కొన సాగింది. చివరికి ఆయన సొమ్మసిల్లి భూమిపై పడిపోయి, స్పృహ కోల్పోయాక గాని ఈ ముష్కరులు వెళ్ళిపోలేదు.

కాస్సేపటి తరువాత ఆయన బానిస అయిన హజ్రత్ జైద్ (రజి) ఆయన్ను వెతుక్కుంటూ ఆయన చెంతకు వచ్చారు. ఆయన్ను ఎత్తుకొని నగరం వెలుపలికి తెచ్చారు. ముఖంపై నీళ్ళు చల్లారు. దాంతో ఆయన గారికి స్పృహ వచ్చింది. ఆయన పరిస్థితిని చూసి, హజ్రత్ జైద్ (రజి)కు ఎంతో బాధ, దుఖ్ఖం కలిగింది. ఈ దుండగులను శపించమని ఆయన మహాప్రవక్త(స)ను కోరగా, ఆయనిలా అన్నారు: " జైద్! నేనెందుకు వారిని శపించాలి. వీరు దైవాన్ని విశ్వసించకపోతేనేమి, వారి రాబోయే సంతతులు తప్పకుండా దైవాన్ని విశ్వసిస్తాయి."

ఇస్లామీయ సందేశం కానివ్వండి లేక వేరేదైనా సంస్కరణోద్యమం కానివ్వండి, అది సఫలీకృతం కావాలంటే నిస్వార్థత మరియు దయార్ద్ర హృదయం ఎంతో అవసరం. దైవప్రవక్త (స) మానవమాళిని అమితంగా ప్రేమించేవారు. మానవకోటికి నిజమైన శ్రెయోభిలాషులూను. ఆయన, దైవధర్మాన్ని ధిక్కరించిన మానవుల్ని భయానకమైన నరకాగ్ని నుండి రక్షించాలని ప్రయత్నించేవారు. ఈ కారణంగానే తన జాతి తనను ఎంత అవహేళన చేసినా, ఎంత ధిక్కరించినా ఎన్ని హింసాదౌర్జన్యాలకు గురిచేసినా, ఆయన వారిని శపించటానికి ఎన్నడూ చేతులెత్తలేదు.

## సవేద్ బిన్ సామిత్ ఇస్లాం స్వీకరణ

ఒకసారి మదీనాకు చెందిన ప్రఖ్యాత పహిల్వాన్ సవెద్ బిన్ సామిత్ మక్కాకు వచ్చాడని తెలిసి, ఆయన అతన్ని కలుసుకున్నారు. ప్రేమైన

వాతావరణంలో సంభాషణ సాగింది. ఆయన సవేద్‌కు ఇస్లాం స్వీకరించమని సందేశమిచ్చారు. దానిపై అతను, బహుశా నా వద్ద ఉన్నదే మీ వద్ద ఉండి ఉండవచ్చు, అని సమాధానమిచ్చాడు. మీ వద్ద ఉన్నదేమిటో తెలుపండని ప్రవక్త మహనీయులు కోరగా, నా వద్ద లుఖ్మాన్ యుక్తి సూక్తులున్నాయని, సవెద్ తెలిపాడు. అంతేకాక కొన్ని పద్యపాదాల్ని వినిపించాడు కూడా. దానిపై దైవప్రవక్త ఇవి కూడా మంచి విషయాలే. అయితే నా వద్ద ఇంతకన్నా మేలైన విషయం ఉంది. అది ఆపాదమస్తకం కాంతి మరియు మార్గదర్శకంతో కూడి ఉన్నదని తెలుపూతూ అతనికి దివ్యఖుర్‌ఆన్‌లోని కొంతభాగాన్ని చదివి విని పించారు. అంతే! సవెద్ హృదయాన్ని ఆ దివ్యావిష్కృతి ఆకట్టుకుంది. అప్పటి కప్పుడే ఆయన ఇస్లాం స్వీకరించారు. ఆయన మదీనా నగరవాసి. ఈ విధంగా ఆయన ద్వారా ఇస్లామీయ సందేశం ప్రథమంగా మదీనాలో పరిచయం అయింది.

## యస్రిబ్ పై దైవదౌత్య కిరణాల జల్లు

మదీనాలోని అవస్ మరియు ఖిజ్రజ్ అనే రెండు తెగలు ఓ దీర్ఘకాలం నుండి అంతర్యుద్ధంలో మునిగి ఉన్నాయి. చివరికి వాటిలో అవస్ తెగ ఓటమికి గురైంది. ఆ తెగవారు మక్కాలోని ఖురైషీయులను మదత్తు దారు లుగా చేసుకోవటానికి మక్కా వచ్చారు. ఈ విషయం తెలియగానే ప్రవక్త మహనీయులు వారి వద్దకు వెళ్ళి వారికి ఇస్లాంను పరిచయం చేస్తూ, దివ్య ఖుర్‌ఆన్‌లోని కొన్ని ఆయత్‌లను పఠించారు. దాంతో వారెంతో ప్రభావితు లయ్యారు. వెంటనే ఇస్లాం స్వీకరించారు. ఆ తరువాత వారు మదీనా వెళ్ళి తమ నగరంలో దైవప్రవక్త (స) గురించి చర్చించుకోసాగారు. యస్రిబ్ (మదీనా) వాసులు, తమ పొరుగు వారైన యూదుల నోట, త్వరలోనే ఒక దైవప్రవక్త ఉద్భవించనున్నాడని అంతకు ముందే విని ఉన్నారు, కనుక ప్రవక్త మహనీయుల గురించి ప్రతి ఇంట్లో చర్చలు మొదలయ్యాయి.

నబవీశకం (దైవదౌత్యశకం) 12లో ఇంకొంత మంది యస్రిబ్ వాసులు. ప్రవక్త మహనీయుల్ని దర్శించుకొని. ఇస్లాం స్వీకరించారు. వారు తిరిగి వెళ్తూ,

తమకు ఇస్లామీయ బోధనలు నేర్పటానికి ఒక మంచి గురువు కావాలని కోరగా దైవప్రవక్త, హజ్రత్ ముస్అబ్ బిన్ ఉమేర్(రజి)ను వారి వెంట పంపించారు. హజ్రత్ ముస్అబ్ బిన్ ఉమేర్ (రజి) కారణంగా మదీనా నుండి ఖుబా ప్రాంతం వరకు, ప్రతి ఇంట్లో ఇస్లాం వ్యాపించి పోయింది.

## బోధకుల నియామకం

ఇస్లామీయ సందేశానికి ప్రతి మనిషి అర్హుడు. ఇందులో ఎలాంటి బేధభావం, పక్షపాతం లేదు. కుల, మత, జాతి, ప్రాంత భేదభావాలకు అతీతంగా లోకంలోని ప్రతి మనిషి దీన్ని అవలంబించవచ్చు. అందుకని ప్రపంచంలోని ప్రజలందరి దాకా ఈ సందేశాన్ని చేరవేయటానికి ప్రవక్త మహనీయులు ఒక కార్యక్రమాన్ని రూపొందించారు. తాను స్వయంగా దైవ దాస్యం గురించి ప్రజలకు హితోపదేశం చేయటమే కాకుండా, ఇస్లామీయ సందేశాన్ని వ్యాపింపజేయడానికి, ప్రజలకు ధార్మిక విషయాలు తెలుపడానికి ప్రవక్త మహనీయులు కొంత మంది బోధకుల్ని కూడా నియమించారు. వీరు దైవ సందేశహరుని ద్వారా విన్న విషయాలు ప్రజలకు తెలుపడమే కాకుండా వాటిని వివరించే వారు కూడా.

## దైవ సందేశహరుని హత్యకు కుట్ర

ప్రపంచంలో వచ్చిన ప్రవక్తలందరూ సత్యధర్మాన్నే ప్రచారం చేశారు. ప్రజల్ని దైవధర్మం వైపుకు ఆహ్వానించారు. మానవుల నిజస్థానమేమిటో వారికి తెలియపర్చారు. కాని అసత్యవాదులు ప్రతి కాలంలోను ఈ మహానుభావుల కార్యక్రమానికి అడ్డునిలిచారు. వారిని రకరకాలుగా హింసించారు. ఇళ్ళ నుండి వెళ్ళగొట్టారు. భగభగమండే మంటల్లో పడేశారు. సత్యదీపికను ఆర్పి వేయటానికి వారు చేయని ప్రయత్నమంటూ లేదు. మక్కా మిథ్యాశక్తులు, స్వకల్పిత ధార్మిక నాయకులు దీనికి భిన్నంగా ఎలా ఉండగలుగుతారు. సత్యం వికసించి, వ్యాపించటాన్ని, ప్రజలు నిజమైన దైవదాసులుగా మారటాన్ని చూస్తూ షైతాన్ ఎలా భరించగలడు.

దైవ సందేశహరుడు తన కార్యక్రమం నుండి వైదొలగడం లేదని, ఇస్లామీయ ఉద్యమం దినదినం ప్రవర్ధమానంగా అభివృద్ధి చెందుతున్నదని తెలుసుకున్న మక్కా నాయకుల ఒంటిపైతేళ్ళు, జెర్రులు ప్రాకసాగాయి. ఇక లాభంలేదని, ఈ ఉద్యమాన్ని, దాని కర్తను శాశ్వతంగా సమాప్తం చేసే ఏదో ఒక నిర్ణయానికి రాక తప్పదని వారు నిర్ణయించుకున్నారు. ఈ లక్ష్యం కోసం ఒక మహోన్నత సర్వసభ్య సమావేశాన్ని ఏర్పాటు చేశారు. వివిధ తెగల నాయకుల్ని ఆహ్వానించారు. ఈ సభలో దైవప్రవక్తను, ఆయన ప్రారంభించిన ఈ ఉద్యమాన్ని శాశ్వతంగా రూపుమాపే కార్యక్రమంపై తర్జన భర్జనలు మొదలయ్యాయి. దీని కోసం సభలో రకరకాల ప్రతిపాదనలు వచ్చాయి. ఈ సత్య ధర్మ వైతాళికుణ్ణి ఒక లోహపు పంజరంలో బంధించి తాళంవేసేయాలని, ఆయన అందులోనే శుష్కించి, కృషించి, నశించి పోయేంత వరకు బయటికి రానివ్వకూడదనే ఒక ప్రతిపాదన వచ్చింది. ఈ సభలో నజద్ నాయకుని రూపంలో వచ్చిన షైతాన్ ఈ ప్రతిపాదనను త్రోసిపుచ్చుతూ ఇలా అన్నాడు. "మీరొక వేళ అతణ్ణి లోహపు బోనులో బంధించినా, అతని సందేశం ఆ బంధనాన్ని దాటి, ప్రపంచమంతటా వ్యాపించి పోతుంది. అంతేకాదు అతని అనుయాయులు, బంధువులు అతన్ని విడిపించుకుపోయే అవకాశం కూడా ఉంది. అందుకని ఈ ప్రతిపాదన సముచితంగా లేదు."

ఆయన్ను తమ మధ్య నుండి వెళ్ళగొట్టాలని, ఆయన్ను దేశం నుండి బహిష్కరించాలని, తమ కళ్ళేదుటి నుండి ఆయన వెళ్ళి పోయిన తరువాత ఎక్కడుంటాడో, ఏమీ చేస్తాడో మనకేం సంబంధం? అనే ఇంకొక ప్రతిపాదన వచ్చింది. నజద్‌నాయకుని రూపంలో నున్న షైతాన్ దీన్ని కూడా త్రోసిపుచ్చాడు.

"దైవసాక్షిగా! మీ ఈ ప్రతిపాదన కూడా సముచితంగా లేదు. అతని మధురవాణి, ఆకట్టుకొనే అతని బాణిని మీరు గమనించడం లేదా? వాటి ఆధారంగా అతను ప్రజల హృదయాలను గెల్చుకుంటున్నాడు. దైవసాక్షిగా! ఎట్టి పరిస్థితుల్లోను అలా చేయకండి. అతణ్ణి మీరిక్కడి నుండి వెళ్ళగొడ్తే, అతను ఏదో ఒక అరబ్బు తెగను ఆశ్రయిస్తాడు. ఆ తెగ అతని మధురవాణికి,

అతని సంభాషణకు ప్రభావితమై, అతనికి దాసోహమంటుంది. ఆ విధంగా అతను ఆ తెగల్ని సంసిద్ధం చేసుకొని మీపై దండెత్తి వస్తే మీరేం చేస్తారు? మీ అధికారాన్ని లాక్కుంటే మీరు చేసేదేముంటుంది? అప్పుడు తనకు తోచిన విధంగా మీ పట్ల ప్రవర్తిస్తాడు. లాభంలేదు. ఇంకేదైనా ఉపాయం ఆలోచించండి." (సీరత్ ఇబ్నె హిషాం వాల్యూం-2, పేజి 94)

సుదీర్ఘ తర్జనభర్జనల తరువాత ప్రతి తెగనుండి ధైర్యసాహసాలు గల ఒక ప్రతినిధిని ఎన్నుకోవాలని, వీరందరూ రాత్రి చీకట్లో దైవప్రవక్త ఇంటిని చుట్టు ముట్టి కాపలా కాయాలని, ప్రాతఃకాల సమయంలో ఇంటి నుండి బయట అడుగు పెట్టగానే ఆయనపై అందరూ మూకుమ్మడిగా విరుచుకు పడి ఆయన్ను సమాప్తం చేయాలని, ఈ విధంగా హంతకుడెవరు అనేది నిర్ధారణ కానప్పుడు బనీ హాషిం తెగవారు రక్త పరిహారం తీసుకోక తప్పదు. ఇక ప్రతీకారం తీర్చుకునే ప్రసక్తే ఉండదని అబూజహల్ ఒక ప్రతిపాదన చేశాడు. దానిపై నాయకులందరూ ఏకగ్రీవంగా తమ ఆమోదాన్ని తెలిపారు. ప్రణాళికను అనుసరించి ఓ రోజు రాత్రి వీరందరూ కరవాలాలు దూసి ప్రవక్త మహనీయుల ఇంటిని చుట్టుముట్టారు. తెల్లవారినప్పుడు ఆయన ఇంటి నుండి అడుగు బయటికి పెట్టగానే హతమార్చాలని కాచుకొని కూర్చున్నారు.

## ప్రపంచపు అతివింతైన సంఘటన

ప్రపంచ చరిత్రలో జరిగిన అన్నిటికంటే విచిత్రమైన సంఘటన ఇది. ఒక వ్యక్తి ప్రపంచ ప్రజల మేలుకోసం, వారి సాఫల్యం కోసం తన సుఖ శాంతుల్ని త్యజించాడు. ప్రజల్ని నరకాగ్ని నుండి కాపాడడానికి తన సమయాన్ని, తన సంపదను, తన శక్తి సామర్థ్యాల్ని, తన సర్వస్వాన్ని పణంగా పెట్టాడు. మానవాళికి సన్మార్గం చూపించే తపనలో అతనికి తన ఉపాధి గురించిన చింతే లేదు. వ్యాపారాన్ని వదులుకున్నాడు. వ్యక్తిగతంగానే కాదు, తన భార్యాపిల్లల యోగాక్షేమాలను సైతం ప్రక్కకు పెట్టాడు. దైవ సందేశ ప్రచారంలో ఎంతగా లీనమైపోయాడంటే, అదొక్కటి తప్ప వేరేది అతనికి

రుచించడం లేదు. అతని ఆలోచనలంతా దీనికోసమే, అతని కృషి ప్రయత్నలూ దీనికోసమే. నిద్రాహారాలు మాని, మానవాళిని కాపాడటమే అతని ప్రధాన లక్ష్యమైపోయింది. ఇంకా విచిత్రమేమిటంటే, ఎవరైతే అతణ్ణి సంహరిద్దామని కాపలా కాస్తున్నారో. వారిలోని చాలామంది తమ అమానతు లను, తమ ధన సంపదను అతని వద్దనే భద్రపరుచుకున్నారు. అతని నీతి నిజాయితీలపై వారికంత గురి. ఏ సమయంలోనైతే ఈ హంతకుల మూక అతణ్ణి హతమార్చటానికి అతని ఇంటిని చుట్టు ముట్టి కాపలా కాస్తున్నారో, సరిగ్గా అదే సమయంలో అతను వారి ఈ అమానతులను, దాచుకున్న విలువైన ఆభరణాలను, సంబంధిత వ్యక్తుల పేర్లు తెలుపుతూ తెల్లారిన తరువాత వారికి అప్పగించాల్సిందిగా హ(జత్ అలీ (రజి) కి అప్పగిస్తున్నాడు. ఎంత విచిత్రం! ఎంత అనూహ్యం!!

ఆ తరువాత ప్రవక్త మహనీయులు హ(జత్ అలీ (రజి) ను తన పడకపై పరుండబెట్టి, దైవనామాన్ని జపిస్తూ, నిర్భయంగా శత్రుసమూహంలో నుండి బయటికి వచ్చేశారు. ఎవరికోసమైతే వారీకాపలా కాస్తున్నారో, ఆయన్ను దైవం సురక్షిత స్థానానికి చేర్చాడనే విషయమే వారికి తెలియదు. ఆయనకు తోడుగా హ(జత్ అబూబకర్ సిద్దీఖ్ రజి కూడా వలస వెళ్ళారు.

## ధర్మం కోసం హిజ్రత్ (వలస)

మక్కా సంఘర్షణలో ఇది చికరి ఘట్టం. దైవదౌత్యపదివి చేపట్టగానే ఆయన వ్యాపారం దాదాపుగా సమాప్తమై పోయినట్లు మనం చూస్తున్నాం. అయన సతీమణి హ(జత్ ఖదీజా (రజి) సంపద కూడా ఈ మధ్య కాలంలో దాదాపుగా హరించుకుపోయింది. ఆయన మక్కాలో నలువైపుల్నుండి ధూషించబడుతున్నారు. ప్రతిచోట అవహేళన, అపహాస్యానికి గురి అవుతున్నారు. ఇక చిట్ట చివరికి ఆయన్ను హతమార్చటానికి కూడా మక్కా అవిశ్వాసులు పథకం వేసుకొని, ఆయన ఇంటిని చుట్టుముట్టారు.ఈ పరిస్థితుల్లో స్వస్థలాన్ని వదిలి వెళ్ళాలని దైవాదేశం వస్తుంది. అంటే తన ఇల్లువాకిలిని, తన

స్వస్థలాన్ని తన సర్వస్వాన్ని వదలి, వెరొక చోటికి వెళ్ళాలని అర్థం. దైవం సృష్టించిన ఈ భూమి సువిశాలమైంది. ఒకచోట సత్యధర్మాన్ని అంటిపెట్టుకొని బ్రతకటం దుర్భరమైపోతే, ఆ ప్రాంతాన్ని, ఆ స్వస్థలాన్ని సైతం వదలివేయాలి కాని సత్యధర్మ ఆచరణలో లేశమాత్రమైనా లోపం రానీయ కూడదనేది దీని భావం.

ప్రతి మనిషికి తన స్వగృహంతో అవినాభావ సంబంధముంటుంది. ప్రతి హృదయంలో తన గ్రామం, తన ప్రాంతం, తన దేశం పట్ల ఎనలేని ప్రేమాభిమానాలుంటాయి. ఏ వాతావరణంలోనైతే తాను పుట్టి పెరిగాడో, ఏ వ్యక్తుల మధ్యనైతే తాను ఎదిగాడో, వాటిన్నిటి పట్ల అతనికి ఉద్రేకపూరితమైన సంబంధబాంధ్యవాలుంటాయి. వాటిని విడనాడటం, వాటిని మరిచిపోవటం మనిషికి దుర్లభమై పోతుంది. ఒక సత్యధర్మ సందేశ హరుని జీవితంలో ఇలాంటి సన్నివేశాలు కూడా వస్తూ ఉంటాయి. తన ఇంటిని, సంపదను. ఆస్తిని, ప్రియ జనులను సర్వస్వాన్ని దైవధర్మ పరిరక్షణ కోసం త్యాగం చేయవలసిన అవసరం ఏర్పడుతుంది. తన విశ్వాసాల్ని, తన ధార్మిక భావనల్ని, తన దృక్ఫధాన్ని రక్షించుకోవటానికి తన సంపదను, తన ప్రియాతిప్రియమైన వస్తువుల్ని, చివరికి తన ప్రాణాన్ని సైతం ధారపోయ వలసిన పరిస్థితులు ఏర్పడతాయి.

ఇది చిన్నపాటి సామాన్య విషయమేమీకాదు. ప్రతి వ్యక్తి దీన్ని ఎదుర్కోలేడు. ఇది అత్యంత ప్రమాదాలు, వ్యధలు, త్యాగాలతో కూడుకున్న కార్యం. ఈ మార్గంపై పయనిస్తూ మంచి మంచి యోధుల గుండెలు అదిరిపోతాయి. కేవలం సత్యధర్మ ప్రచారకుడు మాత్రమే ఈ సంక్లిష్ట పరిస్థితుల్ని ఎదుర్కోగలుగుతాడు. మానవాళి అభ్యున్నతి మరియు సాఫల్యం కోసం అత్యంత అననుకూల పరిస్థితుల్లో సైతం, ధైర్యస్థైర్యాలతో సత్యం కోసం నినదిస్తాడు. దైవాభీష్టాన్ని నెరవేర్చటానికి తన స్వంత ఆలోచనల్ని, తన భావనల్ని, తన కోరికల్ని, తన ఆకాంక్షల్ని నిరంతరం అణగద్రొక్కుతూనే పోతాడు. మానవాళి పూదోటను సస్యశ్యామలం చేయటానికి, మానవకోటి మేలు, సాఫల్యం కోసం అతను తన స్వంత సౌఖ్యాల్ని, సమయాన్ని, ధన సంపదల్ని, తనకు ప్రియాతి

ప్రియమైన వస్తువుల్ని, తన స్వంత గ్రామాన్ని, దేశాన్ని చివరికి తన ప్రాణాన్ని సైతం త్యాగం చేయటానికి నిరంతరం సంసిద్ధంగా ఉంటాడు. ఇహాన్ని కోరే వారి దృష్టిలో అమూల్యమనిపించే ఏ వస్తువూ కూడా ధార్మిక మార్గంలో పయ నించే అతని కాళ్ళకు బంధం వేయజాలదు. దైవం ప్రసాదించిన ప్రతి అమూల్య వస్తువును, చివరికి తన బంధు మిత్రులు, తన ప్రాణాలను సైతం దైవ మార్గంలో త్యాగం చేయటానికి అతనెన్నటికీ వెనుకాడడు.

మక్కా వారి కోసం దైవప్రవక్త పవిత్ర జీవితం హితోపదేశం గరిపే దీప స్థంబంలాంటిది. ఒక పరిపూర్ణవిశ్వాసి, సత్య ధర్మవైతాళికుడు ఎలా ఉంటాడనే ఆదర్శాన్ని ప్రవక్త మహనీయులు తమ వాక్కర్మల ద్వారా క్రియా పూర్వకంగా ప్రదర్శించారు. పదిపన్నేండేళ్ళ సుదీర్ఘ కాలంలో ఆయన తన పటుత్వంతోను, మహోన్నత చరితము ద్వారాను తానో మహోన్నత శీలం గల వ్యక్తినని నిరూ పించారు. తన లక్ష్యం కోసం దేనికైనా సిద్ధపడతారని, లోభ మంటే ఏమిటో ఆయన ఎరుగడని, తన స్వప్రయోజనమేది ఆయన ముందు లేదని, కేవలం మానవ శాశ్వత సాఫల్యవేు ఆయున ప్రథవు, అంతిమ లక్ష్య మనేది సర్వమక్కా వాసులకు తెలిసిపోయింది. అవిశ్వాసులైన మక్కా నాయకు లకు ఈ విష యాలు తెలియనివికావు. అయితే వారి హృదయాలు బిగుసుకు పోయాయి. తమ అనైతిక ప్రవృత్తిని, అపమార్గాలను వారు తమ ప్రత్యే కత లుగా భావించుకున్నారు. ధన మధాంధకారంలో తాము తప్ప, మిగిలిన వారంతా వారికి నీచులుగా, హీనులుగా కనబడేవారు. వినాశనం వారి కళ్ళ ముందున్నా దాన్ని వారు గుర్తించే స్థితిలో లేరు. కరడుగట్టిన పక్షపాతం కళ్ళపై కమ్మిన పొరల కారణంగా వారు సత్యాన్ని సత్యంగా గుర్తించటానికి సంసిద్ధంగా లేరు.

కోరేవారికే, ఆ కాంక్ష ఉన్నవారికే, శ్రమించే వారికే సన్మార్గం లభిస్తుంది. పక్షపాతాన్ని విడనాడి నిర్మల హృదయంతో, స్వంత ఆలోచనలు, భావనలు, మానసిక ఆకాంక్షలకు బానిస కాకుండా, తెరిచి ఉన్న మనోమస్తిష్కాలతో పరి కించే స్వభావం గలవారికే, సముచిత విషయాన్ని ఎలాంటి సంకు చితత్వానికి లోనుకాకుండా స్వీకరించే వారికే సన్మార్గం లభిస్తుంది. మార్గదర్శనం అవుతుంది.

## అఖ్‌బా శపథం

యస్రిబ్ వాసులకు దైవం ఈ సుగుణాలను ప్రసాదించి ఉన్నాడు. వారి హృదయకవాటాలు ఇస్లాం బోధనల కోసం తెరువబడ్డాయి. ఇస్లామీయ ఉద్యమ ప్రారంభ కాలం నుండే అక్కడ ఇస్లాం ఒక సుస్థిరస్థానాన్ని సంపాదించుకోగలిగింది. ఈ విధంగా ప్రవక్త మహనీయులకు, తన సందేశ ప్రచారం కోసం ఒక సముచితమైన, సుస్థిరమైన, అనువైన కేంద్రం లభించింది. యస్రిబ్ వాసులు దైవప్రవక్తపై సానుభూతి చూపి, కేవలం ఆయన్ను ఒక శరణార్థిగా మాత్రమే తమ నగరానికి ఆహ్వానించలేదు. ఆయన్ను ఒక దైవప్రవక్తగా, తమ మార్గదర్శకునిగా, తమ ప్రియతమ నాయకునిగా ఎన్నుకొని మరీ పిలిపించుకున్నారు. అంతేకాక వారు ఈ క్రింది విషయాలకై ప్రవక్త మహనీయులతో శపథం చేసి ఉన్నారు.

1. మేము ఏకేశ్వరుణ్ణే ఆరాధిస్తాము.
2. మేము దొంగతనం, వ్యభిచారం చేయము.
3. మేము మా సంతానాన్ని (అమ్మాయిల్ని) వధించము.
4. మేము ఎవరిపై కూడా నిందారోపణ చేయము, అపవాదులు అంటగట్టము, ఎవరి చాడీలు కూడా చెప్పుకోము.
5. ప్రతి సత్కార్యంలో మేము దైవప్రవక్త ఆదేశాలను శిరసావహిస్తాము.

## మదీనాలో దైవప్రవక్త కార్యకలాపాలు

సమాజంలో వ్యాపించి ఉన్న దురాచారాలను, నిమ్నోన్నతాలను అసమానతలను తొలగించి వాడుకలోనున్న జీవిత విధానాన్ని మార్చి దైవధర్మాన్ని దైవప్రేరిత జీవిత విధానాన్ని స్థాపించడానికీ, మానవ సంతతికి సత్యం, న్యాయ మార్గాన్ని చూపించటానికి దైవప్రవక్త ఈ ప్రపంచానికి పంపబడ్డారు. ఆయన చేపట్టిన ఈ కార్యం బృహత్తరమైనది. బోధనాశిక్షణలు, రాజ్య పరిపాలన నైతికతలు, ఆరాధనలు, ఆర్థిక, సామాజిక వ్యవహారాలు ఒక్కటేమి? ఈ

పరిధిలో జీవితానికి సంబంధించిన అన్ని రంగాలూ వస్తాయి. యస్రిబ్ అప్పటి వరకు అభివృద్ధి చెందని ఒక అనాగరిక బస్తీ అనే విషయం చరిత్ర చదివిన ప్రతి ఒక్కరికీ తెలుసు. ప్రజలు ఇక్కడ కూడా బహు దైవారాధనలో, విగ్రహా రాధనల్లో కూరుకుపోయి ఉన్నారు. అడుగడుగునా దైవధిక్కారం కనిపించేది. సమాజంలో లెక్కలేనన్ని రుగ్మతలుండేవి. హరాం, హలాల్ (నిషేధిత, ఆమోదిత) విషయాల అవగాహన లెకుండేది. సంవత్సరాలు తరబడి తమకు తోచిన రీతిలో జీవితం గడపే అలవాటు పడ్డారు. వీరిలో నుండే కొంతమంది ప్రవక్తగారి వద్దకు వచ్చి ఇస్లాంను స్వీకరించారు. అలాంటి వారిని సంస్కరించటం కూడా అవసరమే. మహాప్రవక్త(స) మరియు ఆయన అనుచరులు ఈ విధంగా తప్పించుకువెళ్ళి, మదీనాలో ప్రశాంత జీవితం గడపడాన్ని మక్కా అవిశ్వాసులు జీర్ణించుకోలేకపోతున్నారు. ఇటు మదీనా లోని కపటులు రకరకాల వదంతుల్ని వ్యాపింపజేసి అల్లకల్లోలాన్ని సృష్టిస్తు న్నారు. వేరొకవైపు మదీనాలోని యూదులు, మక్కా బహుదైవారాధకు లతో మంతనాలు జరుపుతూ, మదీనా ముస్లింల కోసం రకరకాల ప్రమాదాల్ని సృష్టించారు. చివరికి ప్రవక్త మహనీయులపై కూడా ఏ క్షణంలో హత్యా ప్రయత్నం జరుగుతుందోననే బెంగ వారిని వెంటాడుతుండేది. ఈ కాలంలో దైవప్రవక్త అనుచరులు ఎల్లప్పుడు ఆయుధాలు ధరించి, అప్రమత్తంగా ఉంటుండేవారు. కొంచెంసేపటి కోసమైనా దైవప్రవక్త కనిపించక పోతే, ఆయన అనుచరులు కలవరపడి, ఆయన్ను వెదకటానికి బయలుదేరేవారు.

## సర్వకాల, సర్వావస్థలోనూ దైవ సందేశ ప్రచారం

పై విధంగా అన్నివైపుల్నుండి ప్రమాదాలుపొంచి ఉన్నప్పటికీ, దైవప్రవక్త మాత్రం ధైర్యాన్ని విడనాడలేదు. ప్రమాద సూచనల్ని చూచి బెదిరి పోలేదు. దైవంపై పరిపూర్ణ విశ్వాసముంచి, తాను మాత్రం సందేశ కార్యక్రమంలో నిమగ్నమై ఉన్నారు. ఏ సమయంలో, ఏ సందర్భంలో ఏ చిన్న

అవకాశం లభించినా, ఆయన దాన్ని సద్వినియోగం చేసుకొనేవారు. ఈ కాలంలో దైవప్రవక్త చేసిన ప్రసంగాలు మనకు సీరత్ గ్రంథాల్లో లభిస్తాయి. వాటిని అధ్యయనం చేస్తే, సందేశ ప్రచారం ఎంత ప్రాముఖ్యత కలిగిందో మనం అర్థం చేసుకోవచ్చు. అంతేకాక ఆయన గారికి సందేశ ప్రచార వ్యాప్తి తప్ప వేరేది రుచించేది కాదని కూడా మనకు అవగతమవుతుంది. ఆయన గారు సంతకెళ్ళినా, విందుకెళ్ళినా, లేక ఆయన గారితో ఎవరైనా కలువటానికి వచ్చినా, ఏ సందర్భం, ఏ పరిస్థితి అయినా సరే, దైవ సందేశాన్ని వారికి విన్పించడానికి ఆయన సతతం ఆతురతతో ఉండేవారు. దైవధర్మానికి సంబంధించిన విషయాలను వారి ముందుంచి, అత్యంత దయార్ద్ర హృదయంతో, వాత్సల్యం ఉట్టిపడేలా వారికి హితోపదేశం చేసేవారు. ఈ సందర్భంలోనే ఒకసారి ఆయన ఒక ఖనన సంస్కారంలో పాల్గొన్నారు. ఖననం జరిగిన తరువాత, ప్రజల నుద్దేశించి ఆయన ఇలా అన్నారు:

"సోదరులారా! మనమెంత ఏమరపాటుగా ఉన్నాం! మరణమనేది ఇతరులకే కాని మనకు కాదని భావిస్తున్నామా! హక్కులను నెరవేర్చే బాధ్యత కేవలం ఇతరులపైనే ఉంది తప్ప మనపై లేదని భావిస్తున్నామా ! ఏ మృతులను మోసుకొని మనం శ్మశానం వరకు వస్తున్నామో, వారు కొన్ని రోజుల తరువాత తిరిగి వచ్చే ప్రయాణీకులనుకుంటున్నామా! వారిని సమాధుల్లో ఖననంచేసి, వారి సంపదను పంచుకొని, శాశ్వతంగా, సతతం ఈ లోకంలో ఉంటామన్నంత నిశ్చింతగా ఉంటున్నాము. ప్రతి హితబోధను మనం మరిచి పోతున్నాము. రాబోయే ప్రతి ఆపద నుండి ఏమరుపాటుగా ఉన్నాము. తన లోపాలపై దృష్టినిసారించి, ఇతరుల బలహీనతలను కప్పిపుచ్చేవాడు ఎంత ధన్యుడు! తన కష్టార్జిత సొమ్మును దైవమార్గంలో ఖర్చు చేసే, ధార్మిక పండితుల సహచర్యాన్ని అవలంబించే, పేదలు దీనులతో కలిసిమెలసి ఉండే మనిషే ధన్యుడు. ఉన్నత నైతికతలుండి, నిర్మలమైన హృదయం కలిగి, తన వ్యక్తిత్వం వల్ల ఎవరికీ ఎలాంటి హాని, బాధ కలిగించని వ్యక్తి ఎంతటి ధన్యుడు. అవసరానికి మించి తన వద్ద మిగిలిన సంపదను దైవమార్గంలో

ఖర్చుచేసే అనవసరపు మరియు వ్యర్థప్రలాపాలకు దూరంగా ఉండే, ధార్మిక మార్గంపై సులభంగా నడవగలిగే, ధార్మికేతర విషయాలతో ఏ మాత్రం ప్రభావితుడు కాని వ్యక్తి ఎంతటి ధన్యుడు! ఎంతటి అదృష్టవంతుడు! అలాంటి వారికే శుభాకాంక్షలు" (ఖుత్బాతె నబవి పేజి.66-మౌలానా అబ్దుల్ ఖయ్యూం నద్వీ)

అష్అరీలది ఒక గౌరవనీయమైన తెగ. ఆ తెగనాయకుడైన అబూ మూసా అష్అరీ (రజి) ఉన్నత స్థానం కలిగిన మహాప్రవక్త అనుచరులు. ఆయన కృషి ఫలితంగానే, ఆయన తెగలోని అనేక మంది ఇస్లాం స్వీకరించారు. వారు అధికంగా నీటి చెలమల వద్ద, అడవుల్లో నివసించేవారు. ఒకసారి వారిలో నుండి కొంత మంది ప్రవక్త మహనీయుల్ని సందర్శించుకోవటానికి వచ్చారు. వారిని సంభోదిస్తూ దైవప్రవక్త (స) ఇలా ఉపదేశించారు.

"ప్రజలకేమైంది? వారు తమ పొరుగు వారికి ధర్మాన్ని బోధించటం లేదు. చెడుల్నుండి వారిని ఆపటంలేదు. ఇంకా ఇతర ప్రజలకేమైందని? వారు జ్ఞానవంతులైన తమ పొరుగు వారి నుండి ధర్మం నేర్చుకోవటం లేదేమిటి? ధర్మాన్ని అవగాహన చేసుకోరేమిటి? ధర్మంలో ప్రావీణ్యత, విశ్లేషించే సామర్థ్యాన్ని సముపార్జించుకొనే కృషి చేయరెందుకని? వీరందరూ కూడా ధర్మాన్ని నేర్చుకోవాలి లేదా ధర్మాని నేర్పాలి. ధర్మావగాహన చేసుకోవటానికి, ధార్మిక విషయాల్ని విశ్లేషించే నైపుణ్యాన్ని సముపార్జించుకోవాలి లేదా తెలియని వారికి ఈ విషయాలు నేర్పాలి. ప్రజల్ని మంచికై ప్రేరేపిస్తూ చెడుల్నుండి కాపాడుతూపోవాలి. వారే గనుక అలా చేయకపోతే, ఈ (జీవితంలోనే) ఈ భూమిపైన్నే (దైవ) శిక్ష విరుచుకుపడే ప్రమాదముంది."

(కన్జుల్ ఆమాల్ వాల్యూం-2,పేజి-139)

కొంతమంది ఖనన సంస్కారం కోసం వచ్చారు. ఇంకొంత మంది ఆయన్ను దర్శించుకోవటానికి వచ్చారు. ఆయన (స)గారు మాత్రం ప్రతి సందర్భంలోను ఆ సందర్భాన్ని అనుసరించి, వారి ముందు దైవ సందేశాన్ని ఉంచేవారు. ధార్మిక జ్ఞానం సముపార్జించుకోవాలని, సత్యసందేశాన్ని ఇతరుల వరకు చేరవేయాలని వారిలో ఉత్సాహాన్ని నూరిపోసేవారు.

జమాద్ బిన్ సఅలియా, దైవప్రవక్త ప్రాచీన మిత్రుడు. దైవప్రవక్తకు (దైవం క్షమించుగాక) పిచ్చిపట్టిందనే విషయం అబూజహల్ మాటల ద్వారా ఆయనకు తెలిసింది. తన చిరకాల మిత్రునికి చికిత్స చేయిద్దామని జమాద్, ప్రవక్త మహనీయుల వద్దకు వచ్చి ఈ విషయం తెలిపారు. ఈ సందర్భాన్ని సముచితంగా భావిస్తూ దైవప్రవక్త ఆయనతో ఇలా అన్నారు:

"సర్వ స్తోత్రాలు అల్లాహ్ కొరకే. ఆయన్నే మేము స్తోత్రిస్తాం. ఆయన్నే ఆశ్రయిస్తాం. ఆయన్నే నమ్ముకుంటాం. ఆయన్నే విశ్వసిస్తాం. ఎవరికైతే దైవం సన్మార్గం చూపుతాడో అతడ్ని మరెవ్వరూ పెడమార్గం పట్టించలేరు. ఇక ఎవరికైతే దైవం పెడమార్గం పట్టిస్తాడో, అతడ్ని మరెవ్వరూ సన్మార్గం వైపుకు మళ్ళించలేరు. ఏకేశ్వరుని తప్పవేరెవ్వరూ ఆరాధ్యులు కారని మేము సాక్ష్యమిస్తున్నాము. ఇంకా నిస్సందేహంగా ముహమ్మద్ దైవ దాసుడు, దైవప్రవక్త."

ఈ చిరు ప్రసంగానికి హజ్రత్ జమాద్ ఎంతగానో ప్రభావితులై అప్పటి కప్పుడే ఇస్లాం స్వీకరించారు. అంతేకాదు, తానెంతో మంది పెద్ద పెద్ద జ్యోతిష్యుల్ని, మంత్రగాళ్ళని, వక్తల్ని ఉపన్యాసకుల్ని చూశానని, వారి వాక్ధాటిని, వాక్చాతుర్యాన్ని విన్నానని, కాని ఏ ప్రభావం మరియు చొచ్చుకొపోయే ఏ గుణం అయితే ఈ భాషణంలో ఉందో, అది నాకు ఇంకెక్కడా కానరాలేరు అని చెబుతూ (మహాప్రవక్త (స) నోట) ఈ దివ్యవాణిని మళ్ళీమళ్ళీ విని ఆ తరువాత "నా తెగ అంతటి తరపున మీ చేతిపై ప్రమాణం చేస్తున్నానని పలికారు. ఆయన కొద్దిపాటి ప్రయత్నంతోనే, కొన్ని రోజుల్లోనే ఆయన తెగ మొత్తం ఇస్లాం స్వీకరించింది. (త్రిబ్రాని-వాల్యూం-3.పేజి-272)

ఒకరోజు ఫరీద్ బిన్ సవీద్ దైవప్రవక్త(స) వద్దకు వచ్చి 'నా తల్లి మరణించే ముందు తన తరపున ఒక ముస్లిం స్త్రీ బానిసకు విముక్తి కలిగించాలని ఆదేశించిందని, కాని తన వద్ద ముస్లిమేతర ఓ నీగ్రోబానిస మాత్రమే ఉందని, అందుకని తమరు అనుమతిస్తే ఆమెకే విముక్తి కలిగిస్తానని,' కోరారు. "ఆమెను ఇక్కడికి పిలుచుకు రా" అని ఆదేశించారు దైవప్రవక్త (స).

ఆమెరాగానే "నిన్ను పోషించే వారేవరమ్మా?" అనడిగారు. దానికి ఆమె 'అల్లాహ్' అని సమాధానమిచ్చింది. తిరిగి ఆయన(స) నేనెవరో తెలుసా? అని ప్రశ్నించారు. దానికి ఆమె 'మీరు దైవప్రవక్త' అని సమాధాన మిచ్చింది. వెంటనే ఆయన(స) ఈమెకు విముక్తి కలిగించు, ఈమె ముస్లిం అని చెప్పారు.

(అబూదావూద్, నసాయి)

ఇమ్రాన్ బిన్ హసీన్ (రజి) ఇలా తెలిపారు "దైవప్రవక్త(స)ను ఒకసారి మానాన్నగారు కలవడం జరిగింది. ఆయన్ను ఉద్దేశించి దైవప్రవక్త(స), ఇలా "ప్రస్తుతం మీరు ఎన్ని విగ్రహాలను పూజిస్తున్నారు?" అని అడగగా ఆయన పడింటెని పూజిస్తున్నాను, ఆరు ఈ భూమ్మీద ఉన్నాయని, ఏడవది ఆకాశంలో ఉన్నదని సమాధానమిచ్చారు." ఆశ, భయాలు కలిగినప్పుడు మీరెవరిని ప్రత్యేకించుకున్నారని". దైవప్రవక్త ప్రశ్నించగా "అది ఆకాశంలో ఉండే వ్యక్తిత్వం" అని బదులు పలికారు. దానిపై దైవప్రవక్త (స) ఇలా అన్నారు: "హసీన్! నీవు ముస్లిం అయినప్పుడు, నీకెన్నో ప్రయోజనకరమైన విషయాలు తెలుపుతాను" అని అన్నారు. ఈ చిరు సంభాషణ మూలంగానే, మా నాన్న గారి ఆలోచనాసరళి మారిపోయింది. ఆయన ఇస్లాం ధర్మాన్ని స్వీకరించారు.

హదీసు గ్రంథమైన బుఖారిలో ఒక సంఘటన ఇలా వర్ణించబడింది "ఒక యూద మతస్తుడు దైవప్రవక్త (స)కు బానిసగా ఉంటుండేవాడు. ఒకసారి అతను జబ్బు పడ్డాడు. అతన్ని పరామర్శిద్దామని దైవప్రవక్త (స) అతనింటికి వెళ్ళారు. అతని బాగోగులు తెలుసుకున్న తరువాత అతడ్ని "ఇస్లాం స్వీకరించు" అని దైవప్రవక్త ప్రభోదించారు. అతను అక్కడే ఉన్న తన తండ్రి వైపు చూశాడు. అతని తండ్రి "ముహమ్మద్ చెప్పేది విను" అని బదులిచ్చాడు. వెంటనే అతను సద్వచనం కలిమా పఠించి ఇస్లాం స్వీకరించాడు. "ఈ బానిసను నరకాన్నుండి కాపాడిన దైవానికి కృతజ్ఞతలు అనుకుంటూ దైవప్రవక్త (స) అక్కడి నుండి వెనుదిరిగారు."

పై సంఘటనలన్నిటిని పరిశీలిస్తే, ఆయన (స)గారికి దైవసందేశం పట్ల ఎంత మక్కువ, ఎంత ఆత్రుత ఉండేదో విశదమౌతుంది. ఎవ్వరైనా

ఆయన్ను కలువటానికి వచ్చినా, లేదా తానెవరితోనైనా కలిసినా, జబ్బుపడ్డ వారిని పరామర్శించటానికి వెళ్ళినా, లేక ఏ సమావేశంలో ఆయన పాల్గొన్నా, ప్రతిచోట ఒకే సంకల్పం, ఒకే ఇచ్ఛ, ఒకే ఒక కోరిక ఆయన్ను వెన్నాడుతుండేది. ఏ విధంగానైనా సరే, సాధ్యమైనంత ఎక్కువ మందికి దైవ సందేశాన్ని అందించాలి అన్నదే ఆ కోరిక.

## మదీనాలో వివిధ కార్యకలాపాలు

ఈ సమయంలో ప్రవక్త మహనియులు మూడు రకాలైన పనులు చేపట్టాల్సి ఉండింది. మక్కా నుండి ముస్లింలు వలస వచ్చి మదీనాలో స్థిర పడిన తరువాత మదీనా, దాని చుట్టు ప్రక్కలో ఎదుగుతున్న ఇస్లామీయ సమాజాన్ని సంస్కరించటం మొదటిది. అజ్ఞాన కాలపు పద్ధతులను రూపుమాపి, ఈ సమాజాన్ని నైతిక, సాంస్కృతిక, సామాజిక ఆర్థిక పరంగాను మరియు పరిపాలనా పరంగాను కొత్త పునాదులపై నిర్మించటం, మక్కా అవిశ్వాసులు, యూదుల వివిధ తెగలు, కపటులు ఈ మూడు రకాలైన శత్రు వుల కుట్రలు, కుతంత్రాలు, ప్రమాదాల నుండి ఈ చిన్న ఇస్లా మీాయ సమాజాన్ని రక్షించడం రెండవది. ఈ మూడు రకాల వ్యతిరేకుల ప్రతిఘటనలను ఎదుర్కొంటూనే, ఇస్లామీయ సందేశాన్ని వ్యాపింపజేసి, తమ సంఖ్యాబలాన్ని పెంచుకోవటం మూడవది. ఈ మూడు విధాల పనుల్ని ఏకకాలంలో చేయాల్సి ఉంది.

## మస్జిద్ నిర్మాణం

ఆయన (స) గారు ఇవ్వదలిచిన సందేశం సైద్ధాంతిక పరమైనదేకాదు, ఆచరణాత్మకమైనది కూడా అనేది సర్వవిదితం. ఏ సమాజాన్ని ఆయన రూపొందించదలిచారో, ఆ సమాజ నైతిక నిర్మాణమే ప్రధానమైనది. అజ్ఞాన పూరితమైన ఈ వాతావరణంలో ముస్లిములలో మచ్చలేని వ్యక్తిత్వాల్ని సృజించాల్సి ఉంది. వారి నైతికతలు పరులకన్నా మహోన్నతంగా ఉండాలి. వారిశీలం అత్యున్నతంగా, వారి ప్రవర్తన ఆదర్శనీయంగానూ ఉండాలి. వారు సైద్ధాం

తికంగా, ఆచరణాత్మకంగా వారికి వారే సాటిగా ఉండాలి. వారి నరనరాల్లో దైవభక్తి ప్రవహింపగలగాలి. దైవాభీష్టం ముందు వారు తమ భావనల్ని, తమ కోరికల్ని, తమ జీవిత సర్వస్వాన్ని త్యజించటానికి ఎల్లవేళలా సంసిద్ధులై ఉండాలి. అప్పుడే వారికి గుర్తింపు అనేది ఉంటుంది. వారి విశిష్టత ఏమిటో కనబడుతుంది. దైవప్రవక్త (స) ఇస్తున్న సత్యసందేశపు ఫలితాలెమిటో, లోకం తన కళ్ళతో చూడగలగాలి.

ఈ విషయాల్ని, ఈ లక్ష్యాల్ని దృష్టిలో పెట్టుకునే ప్రవక్త మహనీయులు మొట్టమొదటగా మస్జిద్ నిర్మాణ కార్యక్రమాన్ని చేపట్టారు. ఈ విధంగా ముస్లింలకు ఒక కేంద్రం లభించింది. ఆ తరువాత అందులో హితబోధ సభలు, సమావేశాలు ప్రారంభమయ్యాయి. ఈ సభల్లో, సమావేశాల్లో దైవప్రవక్త (స) సహచరులతో సహా ఇతర వ్యక్తులు కూడా పాల్గొనేవారు. తద్వారా వారు ధార్మికంగా, నైతికంగా సాంస్కృతికంగా సంస్కరింపబడేవారు.

## దైవమార్గంలో పోరాడే అనుమతి

దైవప్రవక్త (స), ఆయన అనుచరులు ఖురైశీయుల ప్రత్యక్ష దౌర్జన్యాల నుండి, పట్టునుండి అయితే బయట పడగలిగారు. కాని ముస్లింలు ఇలా మదీనాకు వెళ్ళి పోరాటం, అక్కడ వారు ప్రశాంతంగా ఉండటం ఖురైష్ అవిశ్వాసులకు రుచించలేదు. దీని వల్ల వారి ప్రతీకార జ్వాలలు చల్లారక పోవటమేకాదు, ద్విగుణీకృతమయ్యాయి. అందుకని వారు యుద్ధానికి సన్నద్ధులై మదీనాపై దండెత్తి వచ్చారు. ఈ తరుణంలో ముస్లింలే గనుక చేతులు ముడుచుకొని కూర్చుండిపోయి ఉంటే వారు దారుణంగా హత మార్చబడి ఉండేవారు. అంతేకాక ఏకేశ్వర నినాదమిచ్చే మనిషే ఈ లోకంలో దొరక్కపోయేవాడు. అందుకని దైవం కరుణించి వారిని తమ ఆత్మ సంరక్షణార్థం ఆయుధాలు చేబట్టడానికి అనుమతి నిచ్చాడు. ఆ తరువాత ఇలా ఎన్నో యుద్ధాలు జరిగాయి. మక్కావారు పదేపదే ముస్లింలపై దండెత్తి వచ్చేవారు. చివరికి మక్కా అవిశ్వాసుల ధైర్యం పూర్తిగా సడలిపోయి, మక్కా నగరాన్ని కూడా జయించేటంతటి శక్తిని పుంజుకున్నారు ఈ ముస్లిములు.

## ప్రచార విభాగం

మక్కా విజయం తరువాత యూదులు మరియు ఖురైశీయుల బలం, శక్తులన్నీ మంటగలిసిపోయాయి. ఇప్పుడు ఇక మొత్తం అరేబియాలోనే ఇస్లాంను ప్రతిఘటించే ఏ శక్తీ మిగల్లేదు. అందుకని ఈ ప్రశాంత వాతావరణంలో దైవ సందేశాన్ని ప్రపంచంలోని ఇతర ప్రజల వరకు చేరవేసే లక్ష్యంతో ప్రవక్త మహనీయులు ఒక సందేశ ప్రచార విభాగాన్ని ఏర్పాటు చేశారు. జ్ఞానవంతులు, దైవభీతి పరాయణులైన ప్రముఖుల్ని ఎంపిక చేసి వీరిని అరబ్బులోని వివిధ తెగల్లో ప్రచార నిమిత్తం పంపించనారంభించారు. ఎలాంటి ప్రమాదం లేదని భావించిన చోట ఈ సత్యధర్మ ప్రచారకులు ఒంటరిగానే వెళ్ళి, అత్యంత దయార్ద్రహృదయంతో ప్రేమ వాత్సల్యాలతో హితబోధచేసి, ఈ దైవాదేశాన్ని స్వీకరించమని కోరేవారు. ఇక కొన్ని తెగలు దౌర్జన్యంగా, అమానుషంగా ప్రవర్తిస్తాయనే ప్రమాదం ఉన్నచోట్లకు, ఈ ధార్మిక ప్రచారకుల రక్షణార్థం చిన్న చిన్న రక్షక బృందాలను కూడా వారివెంట పంపించే వారు. ఇలాంటి ప్రయత్నాల ఫలితంగా హజ్రత్ ఖాలిద్, హజ్రత్ అలీ (రజి)లు వెళ్ళిన చోట్ల యమన్, హజీమా తెగలు ఇస్లాం స్వీకరించాయి. ఇదే విధంగా హజ్రత్ అమ్రూ బిన్ ఆస్ (రజి)ను అమ్మాన్ కోసం నియమించారు. అక్కడ కూడా చెప్పుకోదగ్గ ఫలితాలు బయటపడ్డాయి. ఇస్లామీయ ధర్మం పట్ల సదవగాహన ఏర్పాడాలనే ఉద్దేశంతో, వారి హృదయ పరివర్తన కోసం, వివిధ ధార్మిక వర్గాల పాదరీలకు, సన్యాసులకు, మత నాయకులకు ఫర్మానాలు కూడా పంపించడం జరిగింది. (అందులో వారి గౌరవోన్నతులను, హోదాలను కాపాడుతూ వారికి కొన్ని రాయితీలను, సౌలభ్యాల్ని ప్రసాదించటం జరిగింది.)

## రాజులు, పరిపాలకులు,నాయకుల పేరున సందేశ పత్రాలు

6వ హిజ్రీశకంలో, హుదైబియా ఒప్పందం జరిగి మదీనా తిరిగొచ్చిన తరువాత దైవప్రవక్త (స) ఒక కొత్త కార్యక్రమాన్ని ప్రారంభించారు. అరేబియా

లోనే కాక, ఆదేశ పరిసరాల్లో ఉంటున్న వివిధ రాజులు, పరిపాలకులు, నాయకులకు కూడా ఈ దైవ సందేశాన్ని అందజేయటం ఎంతో అవసరమని ప్రవక్త మహనీయులు గ్రహించారు. చెడు అనేది ఈ పరిపాలకులు, రాజులు, నాయకుల నుండే ప్రారంభమై, జనసామాన్యంగా వ్యాపించి పోతుందని, అందుకని ముందు వారిని సంస్కరించి, సన్మార్గంపై తేవటం అనివార్యమని భావించారు. ఈ ఉద్దేశంతోనే ఒకరోజు ఆయన తన అనుచరులను సంబో ధిస్తూ ఇలా అన్నారు.

"దైవం నన్ను సర్వలోకాలకై కారుణ్యమూర్తిగా చేసి పంపించాడు. అందుకని ఈ దైవ సందేశాన్ని ప్రపంచ పరిపాలకులు, రాజులు, నాయకుల వరకు కూడా చేరవేయాలనేది నా ఉద్దేశం. ఈ దైవ కారుణ్యం నుండి ఏ ఒక్క వ్యక్తి కూడా దూరం కాకూడదు. ఏ ఒక్క వ్యక్తి కూడా తప్పిపోకూడదు. మానవు లందరి వరకు ఈ దైవ సందేశాన్ని చేరవేసి, వారెవరూ కూడా మాకు సందేశం అందలేదని దైవంతో తర్కించకుండా ఉండేందుకు కూడా ఇదెంతో అవసరం."

ఆ తరువాత ప్రవక్త మహనీయులు అబిసీనియా పరిపాలకుడైన నీగస్ (నజాషి), రోమన్ చక్రవర్తి అయిన హెరాక్లియస్, ఇరాన్ చక్రవర్తి అయిన ఖుస్రోపర్వేజ్ యమామ రాజు మొదలగు పరిపాలకులకు పేరుపేరున, దైవ సందేశ పత్రాలు వ్రాయించి, పంపించారు. చరిత్ర ప్రఖ్యాతిగాంచిన క్రైస్తవ చక్రవర్తి అయిన హెరాక్లియస్ పేరున వ్రాయించిన సందేశ పత్రం ఇలా ఉంది.

## రోమన్ చక్రవర్తి హెరాక్లియస్ పేరున వ్రాయించిన సందేశ పత్రం

"కరుణామయుడు, కృపాసాగరుడయిన అల్లాహ్ పేరుతో ప్రారంభం. దేవుని దాసుడు, ఆయన సందేశ హరుడైన ముహమ్మద్ (స) తరపున రోమన్ చక్రవర్తి హెరాక్లియస్‌కు వ్రాయునది: సన్మార్గం అవలంబించేవారికి శాంతి శ్రేయాలు కలుగుగాక!

నేను మిమ్మల్ని ఇస్లాం వైపునకు ఆహ్వానిస్తున్నాను. మీరు ఇస్లాం స్వీకరిస్తే, ఇహపరాల ఆపదల్నుండి సురక్షితంగా ఉంటారు. మీకు దేవుడు రెట్టింపు పుణ్యఫలం ప్రసాదిస్తాడు. మీరు గనక ఈ సందేశాన్ని అంగీకరించక పోతే మీ దేశప్రజల పాపభారమంతా మీ మీదపడుతుంది. గ్రంథ ప్రజలారా! మాకు, మీకు ఒకే విధంగా ఉన్న దైవాజ్ఞ, అదే ఏకేశ్వరారాధనను పాటించండి. మనం ఒకే దైవాన్ని తప్ప ఇంకెవరినీ ఆరాధించకూడదు. మనలో ఎవరూ ఆ ఒక్క దేవుడ్ని తప్ప మరెవరినీ దైవంగా చేసుకోకూడదు. ఆయన కార్యకలాపాల్లో ఎవరినీ భాగస్వామ్యులుగా ఎంచకూడదు. దేవునికి తప్ప ఆ దైవత్వపు స్థాయిని మనలోని ఏ సత్పురుషుడైన మానవునికి ఇతరులెవ్వరికీ కల్పించకూడదు. ఈ సందేశాన్ని మీరు అంగీకరించకపోతే మేము మాత్రం అంగీకరిస్తున్నామనే విషయానికి మీరు సాక్షులుగా ఉండండి."

ప్రపంచంలోని ఇతర రాజులకు కూడా ఇలాంటి సందేశాన్నే వ్రాయించి పంపిస్తూ, ఈ దూతలు వెళ్ళే ముందు వారినుద్దేశించి ఇలా ప్రసంగించారు:

"గుర్తుంచుకోండి! మీ సర్వజీవితం మంచిని ఆదేశించటంలో గడిచి పోవాలి. ప్రజల దైనందిన వ్యవహారాల్లో పాలుపంచుకొనే వ్యక్తి, వారికి మంచిని, సన్మార్గాన్ని అనుసరించటం వల్ల కలిగే మేలును గురించి తెలుపని వానిపై స్వర్గం నిషేధించబడింది. వెళ్ళండి! దైవాన్ని నమ్ముకొని ప్రపంచ రాజు లకు ఇస్లాం సందేశాన్ని చేరవేయండి. అయితే ఈ విషయంలో మీ వ్యవహారం మహనీయ ఈసా (అలై) (ఏసుక్రీస్తు) అనుచరుల్లా ఉండకూడదు. వారిని ధార్మిక ప్రచార నిమిత్తం వివిధ నగరాలకు పంపినప్పుడు, వారు తమ సౌలభ్యం కోసం సమీప నగరాలను ఎన్నుకొని, సుదూరంలోనున్న నగరాల వరకు ఈ సందేశాన్ని చేరవేయటంలో వెనుకంజ వేశారు. వారి ఈ మానసిక బలహీనత కారణంగా, మంచిని ప్రేరేపించే పవిత్ర బాధ్యత నుండి వారిని దూరం చేసేసింది."

## సందేశాన్ని తీసుకెళ్ళేవారికి హితబోధ

ఈ విధంగా, దైవ సందేశాన్ని తీసుకువెళ్తున్న వారికి, దైవదాసుల వరకు దైవ సందేశాన్ని చేరవేయటం మీ విధి, బాధ్యత అని బాగా నచ్చజెబుతూ, దైవం

తరపున మీకు లభించిన ఈ సందేశాన్ని ప్రపంచపు చివరి అంచుల్లో నివసిస్తున్న జనుల వరకు చేరవేసేదాక మీ ఈ బాధ్యత నెరవేరదు. ఈ ధర్మాన్ని తు.చ. తప్పక పాటిస్తూ, దాని పరిపూర్ణ స్వరూపాన్ని ప్రజలు తమ కళ్ళతో తిలకించే అవకాశం కలిగించాలి. ప్రళయం రోజు దైవం ఎదుట ఈ ధర్మం గురించిగాని, దైవ సందేశం గురించిగాని తమకు ఏమాత్రం తెలియదని, దాని స్వరూప స్వభావాల్ని తామసలు ఎరుగనే ఎరుగమని, అది తన సంపూర్ణ స్వరూప స్వభావాలతో మా ముందుకు రానే లేదని, దాన్ని పూర్తిగా చూడనప్పుడు దానిపై తామెలా ఆచరించగలిగే వారమని, తమకు తెలియని విషయం గురించి తమను పట్టుకోవటం, శిక్షించటం జరుగుతోంది అంటూ ప్రజలు దైవన్యాయ స్థానంలో తర్కించకుండా ఉండేందుకే ఈ బాధ్యతను, మానవాళి సమక్షంలో సాక్ష్యంఇచ్చే బృహత్తర బాధ్యతను మీపై మోపటం జరిగింది. ఇదొక్కటే మీ జీవిత లక్ష్యం. దీని కోసమే మీరు లేపబడ్డారనే విషయాన్ని వారి మనోమస్తిష్కాల్లో నాటుకుపోయేలా చేయండి అంటూ దైవప్రవక్త (స) వారికి హితబోధ చేశారు.

## హృదయ పరివర్తనం ద్వారా సత్యసందేశ ప్రచారం

ప్రవక్త మహనీయులు ఉద్భవించిన సమయంలో ప్రపంచమంతా అరాచకాలకు, హింసా దౌర్జన్యాలకు, ఎడతెగని రక్తపాతాలకు నిలయమై ఉంది. ప్రతిచోట అన్యాయాలు, అక్రమాలు, హింసా దౌర్జన్యాలు చోటు చేసుకొని ఉన్నాయి. మానవ ప్రాణానికసలు విలువే ఉండేదికాదు. చిన్న చిన్న తగాదాలకే రక్తపాతాలు జరిగేవి. ఒక వర్గానికి చెందిన వ్యక్తి వధించబడితే చాలు, ప్రళయమే ముంచుకువచ్చేది. ప్రతీకారం కోసం రెండు వర్గాలు సంవత్సరాల తరబడి భీకర యుద్ధాలు జరుపుకొనేవి. ప్రతీకాల జ్వాలలు ఎంత తీవ్రంగా ఉండేవంటే, మృతుల్ని ముక్కలు ముక్కలుగా నరికేసేవారు. మనిషిని సజీవంగా అగ్నికాహుతి చేసేవారు. జరిగే కిరాతకాలు, క్రూరత్వాలు వర్ణనాతీతం.

కాని దైవప్రవక్త (స) తన దైవ సందేశ ప్రచారం ప్రారంభంతోనే ఇలాంటి అన్నిరకాల క్రూరత్వాల్ని నిషేధించారు. యుద్ధంలో పోరాడుతున్న వారితో తప్ప వేరెవ్వరిపై చేయి లేపకుడదని ఆదేశించారు. సామాన్య ప్రజల్ని దోచుకోరాదని, పంటపొలాన్ని నాశనం చేయకూడదని, చెట్లకూ, తోటలకూ నిప్పంటించ రాదని, బంధీలుగా పట్టుబడిన వారిపట్ల మానవత్వంతో వ్యవహరించాలని, వారిపై దయ, మేలు, కనికరాలు చూపి, పరిహారం స్వీకరించైనా, లేక పరి హారం లేకుండానైనా వారిని వదలిపెట్టాలని తన అనుచరులకు ఆదేశించారు. ఈ ఆదర్శాలకు, ఈ దయార్ద్ర హృదయానికి "బద్రియుద్ధం" ఒక మంచి నిదర్శనం. ఈ యుద్ధంలో పట్టుబడిన ఖైదీలతో వ్యవహరించిన తీరు ప్రపంచ చరిత్రలోనే ఒక విచిత్ర సన్నివేశం. అంతకు ముందు యుద్ధాల్లో పట్టుబడిన శత్రుసైనికులతో ఇలా వ్యవహరించటం, ఇంతటి దయ, కనికరాలు చూపటం ఖురైష్ వాళ్ళేకాదు, ప్రపంచమంతా కూడా కనీవినీ ఎరుగదు. ఈ వ్యవహారం వల్ల ఇస్లాం ధ్యేయమేమిటో, దాని లక్ష్యమేమిటో, శాంతి సామరస్యాలకు, సహజీవనానికి అదెంతటి ప్రాముఖ్యమిస్తుందో తేటతెల్లమైపోయింది. ఖైదీలకు కట్టిన గట్టి కట్ల కారణంగా ఏ ఖైదీ అయినా ఏకాస్త మూలిగితే, దైవప్రవక్త(స)కు నిదుర పట్టేది కాదు. ఆయన (స) అసహనంగా, అత్యంత వ్యాకులంతో లేచి కూర్చుండేవారు. ఆ ఖైదీల బంధనాలను వొదులు చేసి, వారికి విశ్రాంతి కలిగించనంతవరకు దైవప్రవక్త (స)కు మనశ్శాంతి కలిగేది కాదు. ఈ ఖైదీ లందరూ కూడా మక్కావాసులే. ప్రవక్త మహనీయుల్ని, ఆయన అనుచరుల్ని శాశ్వతంగా సమాప్తం చేయటానికి గొప్ప అట్టహాసంతో వచ్చి భీకర సమరం సలిపిన శత్రుసైనికులు. మక్కాలో ఉన్నప్పుడు దైవప్రవక్త (స)ను ఆయన అనుచరుల్ని చిత్రహింసలకు గురిచేసిన కిరాతకులు. అయితే దురదృష్టం కొద్దీవారు పరాజితులై, బంధీలుగా పట్టుబడ్డారు. అయితే వారి అదృష్టం కొద్దీ, వారి వైరి అయిన దైవప్రవక్త (స) అత్యంత కరుణామయుడు. మానవత్వం మూర్తీభవించిన అనుపమ వ్యక్తిత్వం. వారి బాధ, వారి మూలుగును సైతం భరించలేని దయార్ద్ర హృదయుడు. వారు తనపై, తన అనుచరులపై జరిపిన

అమానుషాలను మరిచిపోయి, వారికి ఇసుమంతా బాధకూడా కలుగకుండా సౌలభ్యాన్ని సమకూర్చిన ఆయన త్యాగనిరతి, ఎంతటి పరమోన్నత వ్యక్తిత్వం ఆయనది! ఎంతటి దయార్ధ్ర హృదయం ఆయనది!! ఎంత కరణరసభరితమైనది ఆయన ప్రవర్తన!!! నిజంగా ఆయన తనకు తానే సాటి. ప్రపంచం ఆయన కంటే ముందుగాని, ఆయన తరువాత గాని ఇంతటి ఉన్నత శీలంగల వ్యక్తిత్వాన్ని కనుగొనజాలదు! ఈ కారణంగానే అనాటి నుండి, నేటి వరకు ఆయన జీవిత చరితమును నిష్పక్షపాతంగా అధ్యయనం చేసిన ఏ ఒక్క వ్యక్తి కూడా ఆయనతో ప్రభావితం కాకుండా ఉండలేకపోయాడు. మహోన్నతమైన మానవ మహోపకారీ! మీకు జోహార్లు!! మానవులకు సంపూర్ణ మానవత్వాన్ని నేర్పటానికి దైవం భువిపై పంపిన అంతిమ దైవప్రవక్తా! మీకు సలాంలు!!

ఈ బద్ర్ యుద్ధం ఒక్కటే కాదు, హవాజన్ తెగకు చెందిన ఆరువేల మంది బంధీలు కూడా ఆయన గారి ఈ కరుణామృతాన్ని చవిచూశారు. ఆయన గారి ఒక్కసైగతో అందరూ విడిచివేయబడ్డారు. కరుడుగట్టిన పక్షపాతంతో, ప్రతినిత్యం ముస్లింల జీవితాన్ని దుర్భరం చేసిన మక్కావాసులపై కూడా ఆయన తన కరుణామృతాన్ని వెదజల్లకుండా ఉండలేకపోయారు. ఒకసారి మక్కాలో తీవ్రక్షామం ఏర్పడి, ఒక్కొక్క గింజకు అల్లాడుతున్న సమయంలో ఆయన గారు వారి హృదయ పరివర్తన కోసం, మక్కాకు ఆహార పదార్థాలను సరఫరా చేయించారు. మక్కా జయించిన రోజున కూడా ఆయన వ్యతిరేకులు నిస్సహాయులుగా, తమ పట్ల దైవప్రవక్త (స) ఎలా ప్రవర్తించనున్నారో అని భయకంపితులై గజగజ వణికి పోతున్నారు. వారిలో ఖురైష్‌కు చెందిన గొప్పగొప్ప విరోధులు, తలబిరుసుతనం గలవారున్నారు. ఇస్లాంను నామరూపాల్లేకుండా నిర్మూలించాలని ప్రతిన బూనిన వారున్నారు. ముస్లింలు తమ ఇల్లువాకిల్ని, స్వస్థలాన్ని విడిచి పెట్టేంత వరకు వారికి నానాహింసలు పెట్టిన వారున్నారు. ముస్లింల ఆస్తుల్ని తాము కైవసం చేసుకొని అనుభవిస్తున్న వారూన్నారు. మహాప్రవక్త (స)ను దూషించినవారు, ఆయన నడిచే మార్గంలో ముళ్ళకంప పరిచినవారు, ఆయనపై చెత్తాచెదారం, ఒంటె మలినాన్ని వేసిన

వారూ ఉన్నారు. మూడేళ్ళపాటు కఠినమైన సంఘ బహిష్కరణకు గురిచేసి, పిల్లలు సైతం ఆకలికి అలమటించేలా కాపలాకాసిన కిరాతకులూ ఉన్నారు. తుదకు ఆయన్ను హతమార్చే సంకల్పం కలిగివున్న వారూన్నారు. మదీనాపై దాడి చేసి ఈ చిరు ముస్లిం సమాజాన్ని శాశ్వతంగా తుదముట్టిద్దామని కంకణం కట్టుకొని పోరాడినా వైరులూ ఉన్నారు. దైవప్రవక్త పిన తండ్రిని హత్య చేసి, ఆయన పచ్చి కాలేయాన్ని నమలిన క్రూరులూ ఉన్నారు. అంతేకాదు, ఎంతోమంది ముస్లింలను కేవలం ఒకే ఒక దేవుణ్ని ఆరాధించే ప్రకటన చేసి నందుకే అంతమొందించిన వారు సైతం ఆ సమూహంలో ఉన్నారు. దైవప్రవక్త (స) కాకుండా మరెవరో సామాన్యరాజు, పరిపాలకుడే ఆ స్థానంలో ఉంటే, ఒక్కొక్కరినిబట్టి ప్రతీకారం తీర్చుకొనేవాడు. సర్వసంహారాన్ని ఆదేశించి ఉండేవాడు. శవాల గుట్టలను పేర్చేసేవాడు. రక్తపుటేరులు ప్రవహింప జేసేవాడు. ఎందుకంటే న్యాయంగాను, చట్ట పరంగాను, ధార్మికంగాను వారు నేరస్థులు. వారిని ఏ విధంగా శిక్షించినా అది తప్పు, పొరపాటు కానేకాదు. ఇది అన్ని విధాల సమంజసమే. అయితే ఆయన (స)గారు చేసిందేమిటి? క్షమిం చారు. అందరినీ క్షమించారు. ఎవరిపై ఎలాంటి నిందమోపలేదు. అంతేకాదు, వారికి కానుకలిచ్చారు. కొందరికి హోదాలను ప్రసాదించారు. ఈ అసాధారణ ఔదార్యం, మంచిప్రవర్తన ఎలా పరిణమించిం దంటే గొప్ప గొప్ప వ్యతి రేకులు, మొండి ఘటాలు పాదాక్రాంతులైపోయారు. వారు "మీరు నిజంగా దైవసందేశహరులే. దేశాలు జయించే రాజు ఎంత మాత్రంకాదు, మీరు ప్రచారం చేసే సందేశమే పరమ సత్యమైనది" అని ఎలుగెత్తి చాటారు. ఇదీ మక్కాను జయించిన తీరుతెన్నులు. ఇది భూమిని, ఆస్తుల్ని, ధనసంపదను జయించటానికి లభించిన విజయం కాదు. దీని ద్వారా హృదయ సీమల్ని జయించటం జరిగింది. హృదయాల్ని జయించిన వాడే జగద్విజేత!!

నజ్రాన్ ప్రాంతానికి చెందిన క్రైస్తవుల బృందమొకటి ఆయన్ను కలుసుకోవటానికి మదీనా నగరం వచ్చింది. ఆయన (స) వారికి స్వాగతం పలకటమేకాక వారికి అతిథి సత్కార్యాలు కూడా చేశారు. తన స్వంత

మస్జిద్‌లో విడిది చేయించారు. వారి ఆచారాన్నే అనుసరించి ఆ మస్జిద్‌లో ఆరాధనకు కూడా అనుమతించారు. కొందరు ముస్లింలు వారిని దీన్నుండి ఆప ప్రయత్నిస్తే వద్దని వాదించారు కూడా.

## ప్రవక్త మహనీయులకు మానవుల గురించిన చింత

ప్రవక్త మహనీయుల సందేశ ముఖ్యోద్దేశ్యమేమిటి? మానవుల, మానవ సమాజాల సంస్కరణ. మానవులు మరిచిపోయిన తమ నిజప్రభువు, సృష్టికర్త, పోషకుడు అయిన ఏకేశ్వరునితో మానవుల సంబంధాల్ని కలపడం. ఇదే ఆయన జీవిత ప్రధాన లక్ష్యం. దేశాలు,రాజ్యాలు గెలువటం ఆయన లక్ష్యం ఎంత మాత్రం కాదు. హృదయాలను గెలువటమే ఆయన కోరింది. ప్రజల హృదయాలపై పేరుకుపోయిన మలినాల్ని కడిగి, వారిని సన్మార్గంపై నడిపించటమే ఆయన ఏకైక లక్ష్యం. లోకంలో వ్యాపించి పోయిన అంధ కారాల్ని తొలగించి, సత్యదీపికను వెలిగించటమే ఆయన సందేశ సారం. ఈ కారణంగానే ఆయన (స) తమ జీవితాంతం సందేశ ప్రచార కార్యక్రమానికే ప్రాధాన్యత నిచ్చారు. మానవులందరికీ వారిప్రభువు పంపిన సందేశం అంద జేయటమే ఆయన(స) తన జీవిత లక్ష్యంగా పెట్టుకున్నారు. మానవులకు ఏ విధంగా సన్మార్గం చూపించాలి? ఏ విధంగా వారిని ప్రభువు అభీష్టం ప్రకారం నడుచుకొనే వారిలా చేయాలి? ఏ విధంగా వారిని దైవాగ్రహం నుండి కాపాడాలి? వారిని నరక జ్వాలల నుండి ఏ విధంగా దూరముంచాలి? ఇదే రాత్రింబవళ్ళు ఆయన ఆలోచన. ప్రజలు పెడమార్గంపై నడుస్తుంటే ఆయన హృదయం తల్లడిల్లిపోయేది. ఈ విషయాన్ని ఆయన భరించలేకపోయేవారు. ఈ విషయంలోనే ఆయన ఎల్లప్పుడూ వ్యాకులతతో గడిపేవారు. తన ఈ పరిస్థితిని ఆయన (స) ఖుద్దుగా ఒక హదీసులో ఇలా వివరించారు.

"నాకూ, మీకూ పోలిన సామెత ఎలాంటిదంటే, ఒక వ్యక్తి వెల్తురు కోసం అగ్నిని రాజేశాడు, అయితే దీపపు పురుగులు మాత్రం చావటానికి, కాలటానికి అందులో పడబోతున్నాయి. వాటిని ఈ అగ్ని నుండి ఎలాగైనా దూరముంచా

లని అతనెంతో ప్రయాసపడుతున్నాడు. అయితే ఈ పురుగులు మాత్రం అతని ప్రయత్నాన్ని వమ్ము చేస్తున్నాయి. నా పరిస్థితి అచ్చం ఇలాగే ఉంది. నేను మిమ్మల్ని చొక్కాలు పట్టీ పట్టీ లాగుతున్నాను, మీరేమో అగ్నిలో దూకటానికి ఉత్సుకులవుతున్నారు."

ఒకవైపు ఆయన (స)గారి ఈ తపన, మానవుల గురించిన ఈ చింతన, ఈ దయార్ద్రత, మానవకోటిపై ఆయనకు గల అనంత ప్రేమాభి మానాలైతే, వేరొకవైపు మక్కా అవిశ్వాసులు ఆయన్ను వ్యతిరేకించటానికి కంకణం కట్టుకున్నారు. ఆయన్ను, ఆయన తెచ్చిన సందేశాన్ని స్వీకరించకుండా రకరకాల సాకులు వెదికే వారు, అడ్డంకులను సృష్టించేవారు. ఆయన్ను కవి అని, మంత్రగాడని, ఎగతాళి చేసి ఆయన బోధనల్ని, ఆయన సందేశాన్ని విలువలేనివిగా చేయాలని ప్రయత్నిస్తే, మరొకప్పుడు ఆయన అనుచరులు బీదవారని, లౌకికజ్ఞానం లేని యువకులని, సమాజంలో విలువలేని దరిద్రు లని, ఆయన సందేశంలోనే గనక శక్తి ఉంటే సమాజ ప్రముఖులు, ధనికులు, నాయకులు దాన్ని ఎందుకు స్వీకరించరు? అని కుతర్కానికి దిగేవారు. అంతటితో ఆగక, ఆయన్ను ఇంటి నుండి, స్వస్థలాన్ని విడిచి వెళ్ళిపోయేంత వివశుల్ని చేశారు. ఆ తరువాత మదీనాలో కూడా నిశ్చింతగా ఉండనివ్వలేదు. మదీనాపై దాడులు మొదలు పెట్టారు. బదర్, హునైన్ యుద్ధాలు సంభ వించాయి. అయితే దైవప్రవక్త(స) మాత్రం ఎక్కడైనా, ఎప్పుడైనా, ఏ సందర్భంలోనైనా ఒక సందేశహరుని పాత్రను మాత్రం విడిచిపెట్టలేదు. అవి యుద్ధమైదానాలు కానివ్వండి, హితోపదేశాలు గరిపే సభలు, సమావేశాలూ కానివ్వండి, ఇస్లాం వ్యతిరేక శక్తుల ప్రతినిధి వర్గాలతో సంప్రదిస్తున్న సమయం లోనైనా, ఇంట్లోని ఏకాంత వాతావరణంలోనైనా, ఏ సమయంలోనూ, ఏ సందర్భంలోనూ ఆయన తన సందేశ కర్తవ్యాన్ని మాత్రం మరిచిపోలేదు.

ఆయన అవిశ్వాసుల్ని, వారి మిథ్యా విశ్వాసాల్ని, మూఢాచారాల్ని, వక్రమార్గాల్ని, ఎంతో సముచితమైన, జ్ఞానపరమైన, తార్కికమైన సాక్ష్యాధరాలు, దృష్టాంతాలతో ఖండిస్తూ, ఏకేశ్వరవాదాన్ని, మరణానంతర జీవితాన్ని

వివరించటానికి, దాన్ని గ్రహింపజేయడానికి ఎంతో ప్రయత్నించి అలసిపోయే వారు. అయితే ఈ వ్యతిరేకులు మాత్రం తమ మొండివైఖరిని విడనాడకుండా కొత్త కొత్త పద్ధతుల్ని అవలంబిస్తూనే ఉన్నారు. ఈ పద్ధతే ఆయనకు బాధా కరంగా మారింది. ఈ పరిస్థితి ఆయన్ను లోలోపల కృశింపజేయ సాగింది. ఆయన అనుభవిస్తున్న ఈ దుఃఖాన్ని ఈ ఖేదాన్ని, ఈ అంతర్మదనాన్ని చూసి, దేవుడు కూడా ఊరకుండలేక పోయాడు. దివ్యఖుర్ఆన్‌లో ఇలా చెప్పాడు.

> "అయితే ప్రవక్తా! ఒకవేళ వారు ఈ ఉపదేశాన్ని విశ్వసించక పోతే బహుశా నీవు వారి కోసం దుఃఖిస్తూ నీ ప్రాణాన్నే కోల్పోతావేమో!" (కహఫ్- 06)

## ఈ కృషీ, ప్రయాసల ప్రతిఫలం

పైన పేర్కొన్న దైవ ఓదార్పు ద్వారా దైవ సందేశాన్ని అందజేయ టంలో, తన బాధ్యతను నెరవేర్చటంలో ప్రవక్త మహనీయులు (స) సంపూ ర్ణంగా కృతార్థులయ్యారనేది స్పష్టమయిపోయింది. హింసా దౌర్జన్యాలతో అడ్డగించ ప్రయత్నించినా, ఆకలి దప్పికలతో వంచించటానికి ప్రయత్నించినా, ఆటంకాలు నిర్బంధాలతో, ధనమాన ప్రాణాలతో చెలగాటమాడి జీవితం దుర్భరం చేసినా, ఎట్టి పరిస్థితుల్లోను ఆయన (స) వెనుకంజ వేయలేదు. ఏ మాత్రం అధైర్యపడలేదు. పరిస్థితుల తీవ్రతకు ఏ మాత్రం చలించలేదు. దానికి బదులు అసమాన ధైర్యస్థైర్యాలతో, అకుంఠిత దీక్షతో తన లక్ష్యంపై, తన ధ్యేయంపై దృష్టిని సారిస్తూ సత్యధర్మసందేశాన్ని, సత్యవచనాన్ని ఈ భువిలో విజేతగా చేసిగాని విడిచి పెట్టలేదు. ఒకానొకప్పుడు ఆయన ఒంటరిగా, ఏకాకిగా నిలబడి ఏకేశ్వరా్య రాధనకై ప్రజలకు పిలుపునిచ్చారు. అదే హజ్జతుల్ విదా (చివరి హజ్) రోజున దాదాపు లక్షన్నర మంది ఏకేశ్వరుని ముందు తమ శిరస్సులు వంచి నిలబడి ఉన్నారు. అరబ్బుదేశమంతటా ఇస్లాం వ్యాపించి పోయింది. దేశం నలువైపుల్నుండి అజాన్ ప్రతిధ్వనులు, ఏకదైవ ఉన్నత్వపు నినాదాలు మిన్ను ముట్టుతున్నాయి.

ఈ (హజ్జతుల్ విదా చివరి హజ్) సందర్భంలోనే ప్రవక్త మహనీయులు (స) తను అనుచరగణాన్ని ఉద్దేశిస్తూ ఇలా అడిగారు.

"ముస్లింలారా! ఇకమీదట నేనూ, మీరు ఇలాంటి సమావేశంలో ఏకమవుతామో లేదో చెప్పలేను. ముస్లింలారా! మీరు త్వరలోనే దైవ సమక్షంలో హాజరు కానున్నారు. అక్కడ నా గురించి మిమ్మల్ని అడిగినప్పుడు ఏమని సమాధానమిస్తారు?"

"మీరు దైవాదేశాల్ని అందజేశారని, దైవదౌత్యం మరియు సందేశ హరుల బాధ్యతను సంపూర్ణంగా నెరవేర్చారని, మంచిచెడుల గురించి మాకు వివరంగా తెలుపారని మేము సాక్ష్యమిస్తాము" అని సమూహమంతా ముక్త కంఠంతో సమాధానమిచ్చింది.

ఇది విని ఆయన (స) తన చూపుడు వ్రేలును ఆకాశం వైపుకు లేపుతూ "ఓ ప్రభూ! నీవే దీనికి సాక్ష్యం!" అని పలికారు.

దాని భావం ఏమిటంటే, ఏ ధర్మాన్నైతే నీవు నాకు అందజేశావో, దాన్ని ప్రచారం చేయటంలో నేనెలాంటి అలసత్వానికి గురికాలేదు, దీంట్లో ఎలాంటి హెచ్చుతగ్గులు లేకుండా నీ దాసుల వరకు చేరవేశాను అని.

ఆ తరువాత ఆయన (స) ఇలా సెలవిచ్చారు.

"ముస్లింలారా! ప్రస్తుతం ఇక్కడ లేని వారి వరకు కూడా దీన్ని చేర వేయండి."

ఇదోరకమైన ఆదేశం కూడాను. ప్రేరణ మరియు ప్రోత్సాహం కూడాను. మానవులందరికి వారి ప్రభువు సందేశం చేరవేసి వారందరూ కూడా దేవుని దాసులు, బానిసలనే వాస్తవాన్ని తెలియజేస్తూ, తమ సర్వ వ్యవహారాల్లో ఆయన దాస్యమే చేయాలనే హితబోధ చేయటం ముస్లింల బాధ్యత. ఇంకా మంచిని ఆదేశిస్తూ, చెడు నుండి దూరముంచటం, మేలైన, క్షేమమైన మార్గాన్ని చూపిస్తూ, దుర్మార్గం నుండి తప్పించటం, సత్యాన్ని, న్యాయాన్ని స్థాపించటం కూడా ముస్లింల విధి, బాధ్యత. ఈ కర్తవ్యాన్ని ప్రళయంరోజు వరకు నిర్వర్తిస్తూనే ఉండాలి అన్నది దాని సారాంశం.

## మనపై ఉన్న సందేశ ప్రచార బాధ్యత

దైవసందేశాన్ని ప్రజలకు చేరవేయటానికి దైవప్రవక్తలు వస్తుండేవారు. తమ వాక్కర్మల ద్వారా దైవధర్మాన్ని ఆచరించి, ప్రజలకు సన్మార్గాన్ని చూపే వారు. అన్ని కాలాల్లోను, అన్ని జాతుల్లోను, ప్రపంచంలోని అన్ని ప్రాంతాల్లోను ఈ దైవప్రవక్తలు వచ్చినవారే. తమ తమ కాలాల్లో, చెడిపోయిన, మార్గభ్రష్టులైన మానవులకు వారి దుష్కర్మల ఫలితం గురించి హెచ్చరిస్తూ ఉండేవారు. అంతే కాక, దైవేచ్ఛ, దైవాభీష్టమేదో వారికి వివరంగా తెలుపుతూ ఉండేవారు. చిట్ట చివరన దైవప్రవక్త ముహమ్మద్ (స) ఉద్భవించారు. ఆయన (స) గారు కూడా తన తుది శ్వాస వరకు ఇస్లామీయ బోధనల్ని పరిచయం చేస్తూ మార్గ భ్రష్టులైన మానవుల వరకు దైవసందేశాన్ని చేరవేసే తన బాధ్యతను పరిపూర్ణంగా నిర్వర్తించి నిష్క్రమించారు.

ఆయన (స)గారు అంతిమ దైవసందేశహరులు. అంటే ఆయన (స) గారితో దైవప్రవక్తల పరంపర సమాప్తమైపోయింది. ఇకిప్పుడు ప్రళయం వరకు యే దైవప్రవక్త, యే దైవసందేశహరుడు వచ్చేదిలేదు. కాని ప్రవక్తల కార్యం, ప్రవక్తల రాకకు గల ఉద్దేశమేదో అది మాత్రం సమాప్తం కాలేదనేది వాస్తవం. దైవాన్ని గుర్తించని, దైవాన్ని మరిచిపోయిన దైవదాసుల వరకు దైవ సందేశాన్ని చేరవేయటం ఈ ప్రవక్తల పని. ఈ పని మాత్రం సమాప్తం కాలేదు, కాజాలదు కూడాను. ఇది అన్ని కాలాల్లోను ప్రళయం వరకునూ జరుగవలసిందే. జరుగు తున్నది కూడాను. అంతిమ దైవప్రవక్త (స) తెచ్చిన ధర్మాన్ని విశ్వసించి, స్వీకరిం చిన వారిపై ప్రళయం వరకు దైవసందేశాన్ని చేరవేసే బాధ్యత ఉంటుంది.

ఈ సందర్భంలో రబీ బిన్ అనస్ తాబయి ఇలా చెబుతున్నారు. "ఏ విధంగానైతే ప్రవక్త మహనీయులు (స) దైవ సందేశాన్ని అందజేశారో మరియు ఏ గ్రంథం ద్వారానైతే ప్రజల్ని హెచ్చరించారో, ఆయన్ను విశ్వసించి, అనుస రించిన ప్రతి వ్యక్తిపై ఈ గ్రంథం ద్వారా ప్రజల్ని హెచ్చరించే బాధ్యత పడు తుంది."

దైవప్రవక్త (స) ఏ విధంగానైతే ఏకాగ్రతతో ఈ విధిని, ఈ బాధ్యతను నిర్వహించారో అదే ఏకాగ్రతతో వారు ఈ బాధ్యతను నెరవేర్చాల్సి ఉంటుంది. దైవప్రవక్త(స) ఏ దైవసందేశానికి సాక్షిగా నిలబడ్డారో దానికి ఆయన(స) అనుయాయులు కూడా ప్రపంచ ప్రజల ముందు సాక్ష్యం ఇవ్వాల్సి ఉంటుంది. ఈ విషయంలోనే దివ్యఖుర్‌ఆన్‌లో ఇలా ఆదేశించడం జరిగింది.

> "ఈ విధంగా మేము మిమ్మల్ని ఒక "మధ్యస్థ సమాజం"గా చేశాము. ఇకపై మీరు సమస్త మానవజాతికి సాక్షులుగా ఉంటారు. ప్రవక్త మీకు సాక్షిగా ఉంటాడు." (అల్ బఖర : 143)

ఇంకొక చోట ఈ అనుచరగణం ఉనికి యొక్క ప్రధాన లక్ష్యాన్ని ఈ విధంగా వర్ణించటం జరిగింది.

> "ఇక నుండి ప్రపంచంలో మానవులకు మార్గంచూపటానికి, వారి సంస్కరణకూ రంగంలోకి తీసుకరాబడిన ఉత్తమ సమాజం మీరే. మీరు మంచిని చెయ్యండి అని ఆజ్ఞాపిస్తారు, చెడు నుండి ఆపుతారు, అల్లాహ్‌ను విశ్వసిస్తారు.
> (అల్ ఇమ్రాన్ :110)

ఇదెంతటి సౌభాగ్యమో! అది మీకు లభించింది ! దైవం మీకు చేసిన ఎంతటి ఉపకారమో ఇది!! తన సందేశ ప్రచార కార్యం కోసం మిమ్మల్ని ఎన్ను కొని దైవం మీకెంతటి గౌరవోన్నతులను ప్రసాదించాడో!!!

## సౌభాగ్య కార్యం

ధనసంపదల్లో, పేరు ప్రఖ్యాతుల్లో, విద్యావిజ్ఞానాల్లో, శక్తి సామర్థ్యాల్లో, అధికారదర్పాల్లో మీ కంటే ఎంతో ముందున్నకోట్లాది ప్రజలు ఈ ప్రపంచంలో ఉన్నారు. అయినా కూడా దైవ కారుణ్య దృష్టి మీపై పడింది. తన సందేశాన్ని తన దాసుల వరకు చేరవేసే శుభప్రదమైన కార్యం కోసం ఆయన తన ప్రవక్త(స) యొక్క ఉత్తరాధికారిగా, వారసునిగా మిమ్మల్ని నియమించాడు. కేవలం

దేవుని కరుణాకటాక్షాల కారణంగా మాత్రమే మీకు లభించిందీ సౌభాగ్యం. ఈ అనుగ్రహంపై మీరెంతగా మురిసిపోయినా తక్కువే. మీరెంతగా దైవానికి కృతజ్ఞతలు తెలుపుకున్నా తక్కువే. అయితే ఇది కేవలం మురిసిపోయే, సంబర పడే, గర్వించదగే అనుగ్రహం మాత్రమే కాదు, ఒక బృహత్తరమైన బాధ్యత, ఒక సున్నితమైన పరీక్షకూడాను. మీ తెలివికి, మీ గ్రహణానికి, మీ శక్తి సామర్థ్యానికి, మీ పట్టుదల, దీక్షకు, మీ విశ్వాసానికి ఓ అగ్ని పరీక్షలాంటిది. తన ఈ కరుణపై, ఈ అనుగ్రహంపై మీరెలా స్పందిస్తారో? ఏ రూపంలో దీనికి మీ కృతజ్ఞతను తెలుపుకుంటారో దైవం చూడదలచాడు. తమ వాక్కర్మల్లో మీరెంత విశ్వాసపాత్రులో, మీకు ప్రసాదింపబడిన ఈ అమానతును, ఈ మహా భాగ్యాన్ని మీరెంతగా గౌరవిస్తారో, ఏ బాధ్యతైతే మీకు అప్పగించబడిందో దాన్నెలా నెరవేరుస్తారో? వీటన్నిటిని దైవం పరీక్షించదలచాడు.

## మనపై ఉన్న బరువు బాధ్యతలు

మీపై మోపబడిన ఈ సాక్ష్యబాధ్యతకు భావం ఏమిటంటే, ఏ సత్యమైతే మీ వరకు చేరిందో, ఏ యదార్థమైతే మీకు ప్రస్ఫుటం చెయ్యటం జరిగిందో, మానవ సాఫల్యం, మోక్షాలకు ఏ ఏకైక మార్గమయితే మీకు చూపడం జరిగిందో, అది ధర్మమయినదని, సత్యమయినదని మరియు అదే ఋజు మార్గమని మీరు ప్రపంచం సమక్షంలో సాక్ష్యం పలకాలి. మీ సాక్ష్యం, అది ధర్మమయినదని, నిజమయినదని బహిరంగ పరచాలి. ప్రపంచప్రజలకు ధర్మం అందజేయబడిందన్న వాదనను పరిపూర్ణం చేయాలి. ఈ సాక్ష్యం పలకడానికే ప్రవక్త లందరూ ప్రపంచంలో ప్రభవింపజేయబడ్డారు. దాన్ని నిర్వర్తించడం వారికి విధిగా చెయ్యబడింది. (షహాదతె హఖ్)

ప్రస్తుతం సత్యం, నికార్సైన దైవాదేశం అనేది కేవలం మీ వద్ద ఉంది. దీన్ని మీరు దైవ సృష్టితాల వరకు చేరవేయటంలో ఏ మాత్రం అలసత్వం చూపినా లేదా సత్యానికి సరిగ్గా, ఉపయుక్తంగా మీకు సాక్ష్యం ఇవ్వకపోయినా, ప్రపంచం షైతాన్‌ను అనుసరిస్తుంది, సత్యకాంతిని పొందకుండా దూరమై

పోతుంది. మానవాళి ఎదుర్కోబోయే ఈ నష్టానికి, బాధ్యత వహించకుండా మీరు తప్పించుకోలేరు. ఈ పాప ఫలాన్ని ఇహపరాల్లోనూ మీరు అనుభవించక తప్పదు. ఇహంలో అంటే, ఈ ప్రపంచంలో ప్రజలు పెడమార్గం పట్టి తమ ఇష్టానుసారం, విచ్చలవిడిగా, బాధ్యతారాహిత్యంగా ప్రవర్తిస్తారు. అనర్థకమైన ప్రతిదాని వైపుకు పోతారు. మానమర్యాదలు, శీలం, విశ్వాసాలు, నైతికతలు ఏవీ సురక్షితంగా ఉండజాలవు. జూదం, మధుపానం, వ్యభిచారం ఇంకా ఇలాంటి అనేక రుగ్మతలు సర్వసామాన్యమైపోతాయి. ఇక పరలోకంలో అంటే మరణానంతరం తీర్పుదినాన దురదృష్టవంతులైన ఈ ప్రజల్ని, సత్యసందేశాన్ని పొంది ఉన్న ఈ అనుచర గణం ఈ సత్యాన్ని, ఈ వాస్తవాన్ని మీకు తెలియ జేసిందా? లేదా? అని దైవం ప్రశ్నించినప్పుడు మీ యొక్క ఈ అలసత్వం కారణంగా, బాధ్యతారహితంగా ప్రవర్తించిన కారణంగా, ప్రజలు మీకు వ్యతిరేకంగా "దేవా! నీ యొక్క ఈ సందేశాన్ని వీరు మాకు తెలుపలేదు." అని సాక్ష్యం చెబుతారు. వారు సమాధానమిచ్చినప్పుడు, మీ పరిస్థితి ఏమిటో, మీరెదుర్కోబోయే పరిణామం ఏమిటో కాస్త ఆలోచించి చూడండి. ఎలాంటి సాకులు, నెపాలు అక్కడ పనిచేయవు. ఏదో ఇచ్చి తప్పించుకుందామంటే దైవదూతలు లంచాలు తినేవారు కాదు. అంతేకాక తీర్పుదినాన మీరెక్కడికీ తప్పించుకొని పారిపోలేరు. దైవ సమక్షంలో మీరు నిలబడాల్సిఉంది, సమా ధానం, సంజాయిషి ఇచ్చుకోవాల్సి ఉంది. దీన్ని మీరు తృణీకరించనూ లేరు, బుకాయించనూ లేరు. ప్రశాంత హృదయంతో ఒకసారి ఈ సంక్లిష్ట పరిస్థితిని, ఈ భయంకర సన్నివేశాన్ని ఆలోచించుకొని చూడండి. ముస్లిములైన కార ణంగా ప్రళయం రాదని, దైవం ముందు నిలబడి సంజాయిషి ఇచ్చు కోవాల్సి లేదని, మీరు కనీసం ఆలోచించనైనా ఆలోచించలేరు. ఎందుకంటే, వీటిని అంటే ప్రళయం, పరలోకం, దైవం ముందు హాజరవటం లాంటివి నిజాలు విశ్వసించిన తరువాతనే కదా మీరు ముస్లిములనబడ్డారు. వాటిని విశ్వసించి నందులకే కదా మీరు విశ్వాసులనబడ్డారు.

# పదవి బాధ్యతకు సంబంధించి సంజాయిషి

మన పరిస్థితి మిగిలిన ప్రపంచ ప్రజల కన్నా భిన్నంగా ఉన్నదని మీకు తెలుసుకదా! విశ్వప్రభువుతో మీ వ్యవహారం ఇంకోరకంగా ఉంది. తన సత్య సందేశాన్ని ఆయన మీకు అప్పగించాడు. ప్రవక్త మహనీయుల (స) ద్వారా ఈ బాధ్యతను, ఈ అమానతును మీకు అప్పగించాడు. ఆదం(స) సంతతిని, జనసామాన్యాన్ని ఏమరుపాటునుండి, అశ్రద్ధ నుండి జాగరూకుల్ని చేసే బాధ్యతను మీకు ధారాదత్తం చేశాడు. ఈ పనికోసం, ఈ మహోన్నత బాధ్యత కోసం మిమ్మల్ని ఎంచుకున్నాడు కాదా! ఈ బాధ్యత నిర్వహణ విషయంలో ప్రళయదినాన సంజాయిషీ అడగబడదని మీరెలా ఊహించ గలుగుతున్నారు. సంజాయిషీ అడగబడుతుంది, తప్పకుండా అడగబడుతుంది. నిలబెట్టి మరీ గట్టిగా అడుగబడుతుంది. మేము ముస్లిములయ్యామని, దేవుణ్ణి విశ్వసిస్తున్నా మని, ఆయన పంపిన ధర్మం మా ధర్మంగా స్వీకరించామని చెప్పిఊరుకో లేరు. ఆయన పంపిన ప్రవక్త(స)ను విశ్వసించామని, ఆయన(స) తెచ్చిన గ్రంథాన్ని మార్గదర్శకంగా ఎన్నుకున్నామని మాత్రమే చెప్పిఊరకోలేరు. ఇంతటి తోనే మీ బాధ్యత నెరవేరదు. ఇంతమాత్రాన మా బాధ్యతను నెరవేర్చామని భావించరాదు. దీనితో పాటే ఇంకో అంశాన్ని కూడా మీరు పరిగణలోకి తీసుకోవాల్సి ఉంటుంది. మీ ఆలోచనలు, భావనల గురించి కూడా ఆలోచిం చాల్సి ఉంటుంది. మీ సమయాన్ని, మీ కార్యకలాపాలు, మీ యోగ్యతలు, మీ శక్తి సామర్థ్యాలు, మీరు జీవితం గడిపే విధానం మొత్తాన్ని పరిశీలించుకొవాల్సి ఉంటుంది. మీ యోగ్యతలు, శక్తి సామర్థ్యాలు మీరు ఏ విషయాల్లో, ఏ రంగాల్లో ఉపయోగిస్తున్నారు? ఏ మార్గంలో వీటిని మీరు వినియోగిస్తున్నారు? మీ ఆలోచనలు, మీ ఆపేక్షలు ఏ వైపుకు పయనిస్తున్నాయి? మీ రాత్రింబవళ్ళు ఎలా గడుస్తున్నాయి? నిజంగానే దైవ సందేశ ప్రచారాన్ని మీ జీవిత లక్ష్యంగా చేసుకున్నారా? లేదా? అలా చేసుకోలేకపొతే, ఈ అలసత్వానికి, ఈ నిర్లక్ష్యానికి, ఈ అశ్రద్ధకు కారణాలేమిటి? ఒకవేళ వాటిని మీ జీవిత లక్ష్యంగా మార్చుకొని ఉంటే, ఈ బాధ్యత నిర్వహణకు సరిపడ స్థాయికి చేరుకొగలిగారా?

చేరుకోలేకపొతే, దీనికి కారణాలేమిటో విశ్లేషించుకుంటున్నారా? సందేశ ప్రచార బాధ్యతను దైవ సందేశాన్ని చేరవేసే బృహత్తర బాధ్యతను సామాన్య ప్రజానీకానికి చేర వేయడంలో మీరెందుకు అశ్రద్ధ? ఆ ఏమరుపాటుకు, అలసత్వానికి మరియు ఉపేక్షకు గురికావడానికిగల కారణాలేమిటో లోతుగా ఆలోచించు కోవాల్సి ఉంటుంది. ఈ బలహీనత వెనుక ఏదైన భయంగాని, ఆశగాని, సోమరి తనంగాని, సుఖలోలత్వంగాని లేవు కదా! వీటిలో ఏదో ఒకటి మిమ్మల్ని సత్యసందేశ ప్రకటన, ప్రచారాలు చేయకుండా ఆపడం లేదు కదా!! అయితే దైవం ఈ విషయంలో ఎలా హెచ్చరిస్తున్నాడో దివ్యఖుర్‌ఆన్‌లో పరిశీ లించండి.

"ప్రవక్తా! ఇలా అను! ఒకవేళ మీ తండ్రులు, మీ కుమారులు" మీ సోదరులు, మీ భార్యలు, మీ బంధువులు, మీ అప్పులు, మీరు సంపాదించిన ఆస్తిపాస్తులు మందగిస్తాయేమో అని భయపడే మీ వ్యాపారాలు, మీరు ఇష్టపడే మీ గృహాలు అల్లాహ్‌కంటే, ఆయన ప్రవక్త కంటే, ఆయన మార్గంలో శ్రమించటం కంటే మీకు గనక ఎక్కువ ప్రియతరమైతే, అల్లాహ్ తన తీర్పును మీ ముందుకు తీసుకువచ్చే వరకు నిరీక్షించండి. అల్లాహ్ దోషులకు మార్గం చూపడు."

(తౌబ-24)

వేరే మాటల్లో చెప్పాలంటే, తన మానసిక కోరికలు, ఆకాంక్షలు కాని, భార్యాపిల్లలుగాని, ధనసంపదలుకాని లేక ఎంత ఉన్నతమైన హోదా కాని ఒక విశ్వాసిని ఈ మార్గంపై నడువకుండా ఆప జాలవు. వాస్తవంలో ఒక విశ్వాసి తన శరీర ఆత్మల్ని తన ప్రభువుకు విక్రయించుకున్నాడు. తన స్వంత కోరికల నుండి, ఆకాంక్షల నుండి, లాభనష్టాల నుండి వైదొలగి, దైవవచనాన్ని ప్రకటిం చడం, ప్రచారం చేయడమే అతను తన జీవితలక్ష్యంగా, జీవిత పరమార్థంగా మార్చుకుంటాడు. అతని జీవన్మరణాలు, అతని సర్వస్వం దీనికోసమే.

(అల్ ఆరాఫ్:162)

మీరు కూడా దైవ ధర్మాన్ని స్వీకరించారు. ప్రవక్త మహనీయులు (స) తెచ్చిన సందేశాన్ని అవలంబించారు. ఈ సందేశప్రచార బాధ్యతను స్వీకరించారు. ఈ మార్గంలో కొన్ని అడ్డంకులు, అవరోధాలు ఏర్పడవచ్చు. మిమ్మల్ని పరిపాలకులు తీక్షణ దృష్టితో చూడవచ్చు. ఈ మార్గంలో మీ స్వంత వ్యాపారాలు, వ్యవహారాలు కుంటుబడవచ్చు. మీకు సుఖసౌఖ్యాలు కరువై పోవచ్చు. ప్రేమించే వారు బహుశా దూషించవచ్చు. మీ స్నేహితులు మీ సహచర్యాన్ని వదలిపెట్టవచ్చు. ఇలాంటి సమయంలోనే మీరు ధైర్య స్థైర్యాలతో నిలబడాల్సి ఉంటుంది. గట్టి పట్టుదలతో, అకుంఠిత దీక్షతో మీరు ముందుకు సాగాల్సి ఉంటుంది. అత్యంత వీరోచితంగా, ప్రాణాల్ని అరచేతిలో పెట్టుకొనైనా సరే మీరు ముందంజ వేయాల్సి ఉంటుంది. మీ సర్వస్వాన్ని ధారపోసి అయినా సరే ఈ బాధ్యతను నెరవేర్చాల్సి ఉంటుంది. ఇలాంటి మొక్కవోని పరాక్రమం, అనుపమ ధైర్యసాహసాల్లోనే మీ ఇహపరాల సాఫల్యం దాగి ఉంది. కావాలనుకుంటే, చరిత్ర అధ్యయనం చేయండి. దైవప్రవక్త అనుచరుల జీవిత చరిత్రలు, వారి జీవిత విధానాలు మీ దృష్టికి వస్తాయి.

## ప్రవక్త (స) వారి అనుచరులు జీవన సరళి, త్యాగనిరతులు

ఆయన (స)గారి అనుచరులు ఎన్నో రకాల బాధలు అనుభవించారు. శత్రువులు వారిని తీవ్రంగా కొట్టి గాయపరిచారు. రకరకాలుగా హింసించారు. ఒళ్ళు జలదరించే నరక యాతనలకు గురిచేశారు. భగభగ మండే నిప్పులపై పరుండబెట్టారు. చర్మ కాలిపోయి, క్రొవ్వు కరిగి బయటకు వచ్చేది. అయినా వారు విశ్వాసంలో రవ్వంత బలహీనత కనబరచలేదు. హజ్రత్ బిలాల్ (రజి)ను ధగధగ మండే ఇసుకపై మండుటెండల్లో బరబరా ఈడ్చారు. అయినా ఆయన నోట అహద్, అహద్ (ఒక్కడే) అనే పదం ఆగలేదు. హజ్రత్ సుమయ్యా (రజి)ను బరిసెతో పొడిచి అబూజహల్ హతమార్చాడు. అయినా ధైర్యస్థైర్యాల్లో ఏ మాత్రం సడలింపురాలేదు. వారి

ముందు ఒక మహోన్నత లక్ష్యం ఉండడమే దీనికి కారణం. ఖుర్‌ఆన్ సందేశం వారి హృదయాల్లో నాటుకు పోయింది. దైవప్రసన్నత కోసం వారు తమ జీవితా లనే పణంగాపెట్టారు. అందుకని ఎంతటి కష్టమైన, క్రూరశిక్షలైనా ఎలాంటి సంకోచం లేకుండా వారు ఎదుర్కో గలిగారు. ఎన్నెన్నో ఆపదలు, భయం కరమైన శిక్షలు కూడా వారిని వంచించలేకపోయాయి. చివరికి చిరునవ్వుతో తమ ప్రాణాల్ని సైతం ఈ మార్గంలో అర్పించుకున్నారు.

నేడు కూడా అలాగే జరిగే అవకాశాలున్నాయి. సందేశ మార్గంలో ఆపదలూ వస్తాయి. త్రోవలో ముళ్ళు పరచబడతాయి. మిథ్యాశక్తులు తమ శక్తిసామర్థ్యాలన్నీ ఉపయోగించి అణచటానికి ప్రయత్నిస్తాయి. షైతాన్ మిమ్మల్ని నిశ్చింతగా కుదురుగా నిదురపోనీయడు. వీటన్నిటి కోసం మీరు సంసిద్ధులై ఉండాలి. ఈ మార్గంలో ఎదురయ్యే కష్టనష్టాలను చూసి బెదిరిపోకండి. అధైర్యపడకండి. వ్యతిరేకతల పెనుతుఫాను మిమ్మల్ని తమ స్థానం నుండి కదలించకూడదు. ప్రతి కాలంలోనూ ఇలా అవుతూనే వచ్చింది. సత్య సందేశం, దైవప్రవక్తలందరి చరిత్ర తెలిపేది ఇదే. మీరు కూడ సత్య సందేశ ప్రచారం కోసం నిలబడినప్పుడు, మీరు ప్రజల తప్పిదాలపై వేలెత్తి నప్పుడు, బలహీనతల గురించి హెచ్చరించినప్పుడు, తప్పు సిద్ధాంతాలను విమర్శించి నప్పుడు, మీపై కూడా విరుచుకుపడటం సహజమే. మిమ్మల్ని కూడా బాధించటం వింతేమీకాదు. అయితే వీటికి మీరు భయపడకండి. దైవానికి భయపడండి. ఆయన చేతిలోనే సర్వాధికారముంది. ప్రళయంరోజు దైవ న్యాయస్థానం తప్పకుండా ఏర్పాటు చేయబడుతుంది. నిష్పక్షపాతంగా, నికార్సు అయిన తీర్పు ఇవ్వబడుతుంది. ఆ రోజుకు, ఆ న్యాయస్థానానికి భయపడండి. ఈ ప్రాపంచిక జీవితమైతే అశాశ్వితమైనది, క్షణభంగురమైనది. మనిషి ఇందులోనే మునిగిపోయే, లీనమైపోయేంత విలువగలిగిందేమికాదిది.

> "అప్పుడు (ఆరోజు) సంపద వల్లగాని, సంతానం వల్లగాని ఏ లాభమూ కలగదు, ఏ వ్యక్తి అయినా మంచి మనస్సుతో అల్లాహ్ సాన్నిధ్యంలో హాజరైతే తప్ప." (అష్షుఅరా-88,89)

ఈ అనుచరగణం బ్రతికి బట్టకట్టాలంటే, తమకెదురవుతున్న కష్ట నష్టాల నుండి బయటపడాలంటే ఈ ఒక్క ధ్యేయాన్నే తమ జీవిత లక్ష్యంగా మార్చుకోక తప్పదు. ప్రతి ముస్లిం పరలోక జీవితాన్ని దృష్టిలో పెట్టుకునే జీవించాల్సి ఉంది. పరలోక జీవితం, దైవప్రసన్నత ఈ రెండే ఇహపరాల్లో ముస్లింలకు సాఫల్యాన్ని ఇవ్వగలుగుతాయి.

## దైవప్రవక్త (స) సచ్చరితం దాని ప్రభావాలు

సందేశ జయాపజయాలు అత్యధికంగా రెండేరెండు విషయాలపై ఆధారపడి ఉంటాయి. సందేశవాహకుడు ఎంతటి ఉత్సాహ ఉత్సుకతకలతో ఈ పనిలో లీనమై దైవసందేశాన్ని ప్రజలకు అందిస్తున్నాడనేది ఒకటి. దీన్ని గడచిన పేజీల్లో వివరించటం జరిగింది. రెండవది సందేశవాహకుని స్వప్రవర్తన. అంటే ఏ సందేశాన్నైతే అతను ప్రజలకు పరిచయం చేస్తున్నాడో, ప్రచారం చేస్తున్నాడో దానిపట్ల స్వయంగా అతని ప్రవర్తన ఎలా ఉంది అనే విషయం.

దైవసందేశం ఒక మహోన్నత కార్యమనే విషయం మనందరికీ తెలుసు. కాని ఎప్పటివరకైతే సందేశ హరుని మనోమస్తిష్కాల్లో దీని గురించి పరిపూర్ణ విశ్వాసం ఏర్పడదో, అతను దైవదాస్యానికి, దైవాభీష్టానికి ప్రతీకగా నిలబడడో, అప్పటివరకు అతను చేసే పనిలో జీవముండదు. ప్రజల్ని ఏ సందేశం వైపుకైతే పిలువదలిచాడో ఖుద్దుగా అతని నైతికత, అతని ప్రవర్తన ఈ సందేశ ప్రభావాన్ని ప్రతిబింబింపజేయాలి. అంటే ఇతరుల్ని పావనులుగా మార్చుటకు ముందు తాను స్వయంగా పావనునిగా మారాలి. ప్రపంచ ప్రజల్ని దైవకాముకులుగా మార్చటానికి ముందు తాను దైవకాముకునిగా మారి చూపించాలి. అన్ని ధర్మాల్లో ఉత్తమమైనది దైవధర్మమని, దేవుడు తన ప్రవక్తల ద్వారా పంపిన జీవన వ్యవస్థేమేలైనదని, ఇస్లామీయ జీవన వ్యవస్థే అన్ని వ్యవస్థలకన్నా పరిపూర్ణమైనదని ఆతను చెబుతున్నప్పుడు తాను ఖుద్దుగా ఈ వ్యవస్థను అనుసరించాలి. ఈ ధర్మాన్ని ముందు తాను స్వయంగా,

సంపూర్ణంగా ఆచరించి చూపాలి. ఫలితంగా ప్రజలు వాటి యొక్క శుభాలను అతని జీవితంలో కనగొనగలగాలి. అంతేకాక అతని నడవడికలు, అతని ప్రవర్తన ఈ సత్య సందేశానికి ఒక నిదర్శనంగా నిలువగలగాలి.

ఈ సందర్భంలో దైవప్రవక్తల జీవితాలు మైలురాయిగా నిలుస్తాయి. దైవప్రవక్తలు లోకంలోకి వచ్చి లోకవాసులకు దైవసందేశాన్ని వినిపించారు. దైవాభీష్టమేదో ప్రజలకు విడమరిచి మరీ చెప్పారు. సత్యం నుండి తిరుగ బడిన, ఏ మరుపాటుతో ఉన్న ప్రజల్ని దైవ ధర్మాన్ని అవలంబించమని ఆహ్వా నించారు. ఫలితంగా ప్రజల్లో దైవవిధేయత, దైవదాస్యపు భావనలు జన్మిస్తా యని, వారు ఆయన ఆజ్ఞను శిరసావహించి ఆయన హితోపదేశాలపై నడుస్తారని వారు ఆశించారు.

ఈ దైవప్రవక్తలు ప్రజల్ని దైవధర్మం వైపుకు ఒకటి రెండుసార్లు పిలిచి ఊరకుండలేదు. దానికి భిన్నంగా తమ సర్వ జీవితాల్ని దీని కోసం వెచ్చించారు. అంతేకాదు, ఏ హితోపదేశాలను వారు ప్రజలకు బోధించారో, వారూ, వారి అనుచరగణాలు కూడా వీటిని అనుసరించి చూపారు. ఇంతటి కట్టుదిట్టమైన ఏర్పాటు చేయటానికి కారణం ఏమిటి? ప్రజలకు, వారి సృష్టికర్త, నిజప్రభువు అభీష్టమేమిటో, లోకంలో ఏ విధంగా జీవితం గడిపితే ఆయన ప్రసన్నుడవు తాడనే విషయాలు తెలుపటంలో ఏ దృష్టితోను, ఏ కోణంలోను లోపం ఉండ కూడదనేది దేవుని అభిమతం. ప్రళయం రోజు ప్రజలు తమ చెడు వర్తనానికి, పోకిరి చేష్టలకు ఎలాటి సాకులు చూపే అవకాశం ఉండకూడదని, ఏ విషయాల గురించి మమ్మల్ని ఇప్పుడు సంజాయిషి అడుగుతున్నారో ఆ విష యాలు భూలోకంలో వారికసలు తెలుపబడనే లేదని ప్రజలు దేవునిపై నిందమోపకుండా ఉండేందుకే దైవప్రవక్తలు అత్యంత కష్టప్రయాసలకోర్చి, దైవసందేశాన్ని చేరవేశారు. ఇక ఆ తరువాత కూడా వారు పెడమార్గాన్ని, దౌష్ట్యాన్ని విడువకపోతే ప్రజలు స్వయంగా దానికి బాధ్యత వహించాల్సి ఉంటుంది. వారి ఎలాంటి సాకులు, మిషలు అక్కడ చెల్లనేరవు.

# చీకట్లో దీపం

ఈ లోకంలో దైవప్రవక్తలు చీకట్లో దీపం లాంటివారు. ఎప్పుడైతే దీపం వెలుగుతుందో, అది తన పరిసరాల్లో వ్యాపించి ఉన్న అంధకారాల్ని దూరం చేసి, మనిషికి సౌకర్యాన్ని కలిగిస్తుంది. వాస్తవంలో ఒకవేళ ఈ దైవప్రవక్తలే గనుక రాకపోతే ఈ ప్రపంచమంతా అంధకారమయంగానే ఉంటుండేది. పరస్పర హక్కులేమిటో మానవులు తెలుసుకోలేకపోయేవారు. మరియు మురికి కూపంలోనే పడిఉండేవారు. కాని పరమ కరుణామయుడైన దైవం మానవాళిపై జాలిచూపాడు. మానవులు చెడువర్తనాన్ని అవలంబించినప్పుడల్లా, ఆయన వారిని హెచ్చరించటానికి, సన్మార్గాన్ని చూపటానికి ప్రవక్తల్ని పంపిస్తూ వచ్చాడు.

ప్రవక్త మహనీయులు(స) దైవసందేశాన్ని ప్రారంభించక ముందు, మానవుడు దైవానికి ఎదురు తిరిగి బహుదైవారాధన ఇంకా ఇలాంటి అనేక దురాచారాల్లో, భ్రమల్లో కూరుకుపోయి ఉండే వాడని మేమింతకు ముందే వివరించి ఉన్నాము. నైతిక పతనం, అశ్లీలం వాడవాడన వ్యాపించి ఉండేది. సమాజంలో అన్యాయ అక్రమాలు, వ్యవహారాల్లో మోసం, దగా సర్వ సామాన్యమై ఉండేది. బలవంతుల దౌర్జన్యాలకు బలహీనులు మసి అయిపోతుండేవారు. ఆడపిల్లలు సజీవంగా పాతిపెట్టబడేవారు. ఒకతెగపై వేరొక తెగ పరస్పరం మెరుపు దాడులు జరిపేది. నలువైపులా, హత్యా దౌర్జన్యాల అంతం లేని పరంపర కొనసాగుతుండేది. ఏ ఒక్క వ్యక్తి ధనమాన ప్రాణాలు కూడా సురక్షితంగా లేకుండేవి. ఇలాంటి అంధకార బంధురమైన వాతావరణంలో పుట్టి పెరిగినప్పటికి ప్రవక్త మహనీయుల(స) అలవాట్లు, నైతికతలు, భావనలు, ప్రవర్తన మొదటి నుండే అందరికంటే భిన్నంగాను మహోన్నతంగాను ఉండేవి. ఆయనెప్పుడూ అబద్ధమాడి ఎరుగరు. ఎవరినీ దూషించి ఉండలేదు. ఆయన పలుకులు మృధువుగాను, మధురంగాను ఉండేవి. ప్రజలు ఆకర్షితులయ్యేంత తియ్యగా మాట్లాడేవారు. ఏ ఒక్కరి చిల్లగవ్వ కూడా అన్యాయంగా తీసుకొనలేదు. ఆయన నీతి నిజాయితీ ఎంత

గణనీయంగా ఉండేవంటే, ప్రజలు తమ అమూల్య వస్తువుల్ని భద్రపరచమని ఆయన(స)కు అప్పగించేవారు. వారి ఈ సంపదను ఆయన (స) అత్యంత జాగ్రత్తగా, ప్రాణపదంగా సంరక్షించేవారు. జాతి వారంతా కూడా ఆయన నీతి నిజాయితీని, సత్య సంధతను పరిపూర్ణంగా విశ్వసించేవారు. అందుకే ఆయన్ను "సాదిఖ్ (సత్యసంధుడు) "అమీన్" (నిజాయితీ పరుడు), అనే గుణవాచక నామాలతో పిలుచుకొనేవారు. ఆయన బంధువులు, మిత్రులు, తెగ ప్రజలు, వాడలోని వారందరూ ఆయనకు ప్రధమ స్థానమిచ్చేవారు. తమకన్నా మిన్నగా చూసుకొనే వారు. ఆయన(స) ఆదర్శాలు, ధైర్యస్థైర్యాలు, మహోన్నత సంకల్పాలు, హృదయ విశాలత్వం కారణంగా ప్రతి సభలో, సమావేశంలో ఆయన్ను ఆహ్వానించేవారు. ఆయన చేతనే తమ తగాదాల తీర్పు పరిష్కారాలు చేయించుకొనేవారు. కాబా దైవ గృహ నిర్మాణ సమయంలో "హజ్రె అస్వద్" ప్రతిష్టాపన సమయంలో చెలరేగిన వివాదం సందర్భంగా ఆయన ఎంతో సమయస్ఫూర్తితో, సంయమనంతో, నిష్పక్షపాతంగా, సందర్భోచితంగా ఆయన చూపిన పరిష్కారం ప్రజలను ఎంతో అబ్బుర పర్చింది. వారు ఆయన్ను వెనోళ్ళకొనియాడారు. రక్తపాతానికి దారి తీస్తుందను కున్న వివాదం, అత్యంత ఆనంద, ఆహ్లాదకరంగా పరిష్కరించా రాయన (స). అరబ్బు దేశమంతా కూడా మధుపానం, కవిత్వం అంటే పడిచచ్చేది. మత్తును, మధుపానాన్ని గౌరవ సూచకంగా భావించేవారు ప్రజలు. అశ్లీలం, వ్యభిచారం, స్త్రీలను వేధించటం సర్వసామాన్యమై ఉండేది. ఆయన ఒక అందమైన, ఆరోగ్యవంతుడైన, ఆకర్షణ గల యువకుడు. అయినప్పటికీ ఆయన ఈ అశ్లీలాల్ని కన్నెత్తి కూడా చూసే వారుకాదు. ఆయన పినతండ్రి అయిన అబూతాలిబ్ కన్నా అధికంగా, ఆయన (స)గారి బాల్యాన్ని, యవ్వనాన్ని చూచిన వారెవరుంటారు? ఆయన ఏమంటున్నారంటే "బాల్యంలో ముహమ్మద్ ఏ ఒక్కసారి అబద్ధమాడినట్లు నేను చూడలేదు, పరిహాసాలు చేయులేదు, అజ్ఞానంగా ప్రవర్తించలేదు, లేక తుంటరి, పోకిరి పిల్లలతో తిరిగి ఉండలేదు"

పది పన్నెండు సంవత్సరాల ప్రాయంలో ఆయన ఇతర పిల్లలతో కలిసి మేకలు కాసేవారు. రాత్రి సమయంలో ఈ పిల్లలు వంతులవారీగా బస్తీలోకెళ్ళి

కథలు వినేవారు. ఒకసారి ఈ పిల్లలు ఆయన్ను (స) కూడా గానం వినటానికి వెళ్ళమని ప్రోత్సహించారు. కాని త్రోవలోనే ఓ వివాహ సమావేశం జరుగుతుండగా దాన్ని చూద్దామని ఆగిపోయారు. అంతలోనే ఆయనకు నిదుర వచ్చేసింది. తెల్లారే వరకు గాని ఆయనకు మెలుకువరాలేదు. ఈ విధంగా దైవం ఆ గానకచ్చేరి నుండి ఆయన్ను రక్షించాడు. అనాగరిక, అసభ్య అశ్లీల ప్రవర్తన గల జనుల మధ్యలో పుట్టి, పెరిగినప్పటికీ, ప్రతి అసభ్యమైన, అశ్లీలమైన పనంటే ఆయన(స) ఏవగించుకునేవారు. తన జాతివారిని హింసా దౌర్జన్యాలు, రక్తపాతాల్లో మునిగి ఉండటం చూసి ఆయన(స)గారి మనస్సు తల్లడిల్లి పొయేదంటే ఆయన భావనలు, ఆలోచనా సరళి ఎలాంటిదో అర్థం చేసుకోవచ్చు. అంతేకాక ఈ యుద్ధాల్ని, రక్తపాతాల్ని ఆపడానికి, వారిలో రాజీ, సంధులు కుదుర్చటానికి శక్తివంచన లేకుండా ప్రయత్నిస్తుండేవారు. ప్రతి ఒక్కరి ఆపద, దుఃఖాల్లో పాలుపంచుకొనే దయార్ధ్ర హృదయుడు. ఆయన వితంతువులకు, అనాధలకు సహాయపడేవారు. ఆకలిగొన్న వారికి భోజనం పెట్టించేవారు. బాటసారుల బాగోగులను తెలుసుకొని వారికి ఆతిధ్యమిచ్చేవారు. విగ్రహారాధకుల జాతిలో ఉంటూ కూడా విగ్రహాలంటే అసహ్యించుకొనేంత తెలివి, వివేకం గలవారు. ఏనాడూ, ఏ సృష్టితం ముందు ఆయన తలవంచి ఎరుగరు. మౌలానా మౌదూది (రహ్మ)గారు వర్ణించినట్లు, అనాగరిక జాతిలో ఆయన ఒక ప్రత్యేక మనిషిగా, రాళ్ళకుప్పలో మెరుస్తున్న వజ్రంలాగా, కారుచీకటిలో వెలుగుతున్న ఓ దీపంలాగా కనబడుతుండేవారు.

## దైవదౌత్య ప్రకటనకు ముందు జరిగిన కొన్ని సంఘటనలు

ప్రవక్త పదవి రాకపూర్వం ప్రజలు ఆయన (స) గారి వ్యక్తిత్వం, మూర్తిమత్వానికి ఎలా ప్రభావితులైయ్యారో తెలపడానికి కొన్ని ఉదాహరణలు ఇక్కడ ఇవ్వడం జరిగింది.

## శాంతి స్థాపనకై ఒక సదస్సు ఏర్పాటు

అరబ్బు దేశంలో అనైతికతలు, అశ్లీలాలే సర్వ సామాన్యమై లేవు. దీనితో పాటుగా దేశంలో శాంతి అనేదే కరువై పోవటం ఆయన తెలుసు కోవటం జరిగింది. ప్రతి నిత్యం జరిగే యుద్ధాలు, రక్తపాతాలు, అమాయకుల రక్తాన్ని చిందించటం సర్వసామాన్యమైపోయింది. ఏ ఒక్కరి ప్రాణానికి కూడా రక్షణ అంటూలేదు. కనుక ఆయన మానవశ్రేయం దృష్ట్యా, శాంతి స్థాపనకు నడుం బిగించారు. ఇలాంటి రక్తపాతాల వాతావరణంలో ఆయనలోని నాయకత్వ ప్రత్యేకతలను యోగ్యతలను ప్రతిబింబింపజేసిన ప్రప్రథమ ప్రదర్శన ఇది. ఈ సందర్భంలో పలువురు ప్రముఖులతో మాట్లాడారు. విధ్వం సాలు, అరాచకాల ఫలితాలెలా ఉంటాయే వారికి వివరించారు. ఖురైష్ నాయ కుల్ని సమావేశపరిచి హింసా దౌర్జన్యాల్ని, అన్యాయ అక్రమాల్ని, రక్తపాతాల్ని ఆపాలని వారికి నొక్కిచెబుతూ, వారందరిని ఒక శాంతి ఒప్పందంపై రాజీ పరచారు. ఆ ఒప్పందంలోని కొన్ని ముఖ్యాంశాలు ఇలా ఉన్నాయి.

1. దేశం నుండి అరాచకాన్ని దూరం చేస్తాం.

2. ప్రయాణికుల్ని, బాటసారుల్ని రక్షిస్తాం.

3. పేదలను ఆదుకుంటాం.

4. ఏ దౌర్జన్యకారుణ్ణి మక్కాలో నిలువనీయం.

ఈ సదస్సు ఏర్పాటు మూలంగా శాంతిస్థాపనకు పునాదిపడటమే కాకుండా, దైవప్రవక్త(స)లోని నాయకత్వ లక్షణాలు కూడా ప్రజల్ని ఆకట్టుకున్నాయి. అందుకే వారు ఆయన్ను పేరుపెట్టి పిలువకుండా సాదిఖ్ (సత్యసంధుడు) అమీన్ (నిజాయితీ పరుడు) అనే గౌరవనామాలతో పిలుస్తుండేవారు.

# కాబా (దైవ గృహం) నిర్మాణ సందర్భంలో దైవప్రవక్త(స) మార్గదర్శనం

ఆ రోజుల్లోనే ఇంకో ముఖ్య సంఘటన చోటుచేసుకుంది. ఈ కారణంగా అరబ్బు వివిధ తెగల్లో రాజుకోబోయే యుద్ధాగ్ని, దైవప్రవక్త(స) సూచించిన పరిష్కారం మూలంగా ఆగిపోయింది. దీని ఫలితంగా సర్వ అరేబియా ప్రజల హృదయాలపై ఆయన(స) చెరుగని ముద్ర వేయగలిగారు.

అరబ్బు తెగలన్నీ కలిసి సమిష్టిగా కాబా నిర్మాణాన్ని చేపట్టాయి. "హజ్రె అస్వద్" అనే రాయిని స్థాపించే భాగ్యం తమ కంటే తమకే దక్కాలనే విషయంలో అరబ్బు తెగల్లో వివాదం మొదలయింది. అది కాస్త చిలికి, చిలికి గాలివానగా మారింది. కత్తులు ఝుళిపించి సై అంటే సై అనే వరకు ఉద్రేకాలు పెరిగిపోయాయి. అంతలోనే అనుభవజ్ఞుడైన ఒక పెద్ద మనిషి 'రేపుదయం అందరికంటే ముందు ఎవరైతే దైవగృహమైన కాబా ప్రాంగణంలో ప్రవేశిస్తాడో అతణ్ణి మధ్యవర్తిగా ఒప్పుకొని అతను సూచించిన పరిష్కారానికి అందరూ సమ్మతించాలి" అని సలహా ఇచ్చాడు. ఈ సలహా అందరికీ నచ్చింది. అదృష్టవశాత్తు మార్నాడు తెల్లారే సమయానికి కాబాదైవ గృహ ప్రాంగణంలో ప్రవేశించిన మొదటి వ్యక్తి ప్రవక్త మహనీయులే. ఆయన్ను చూసి ప్రజలందరూ సంబరపడిపోయారు. నలువైపుల్నుండి "అమీన్ (నిజాయితీ పరుడు) వచ్చేశాడు, మేమాయన తీర్పుకు కట్టుబడి ఉంటాం" అనే కేకలు ప్రతిధ్వనించాయి.

ఆయనలోని ఈ నిస్వార్థత, సత్యసంధత, నిజాయితీల కారణంగానే ఆయనకు నాయకత్వ స్థానం లభించింది. ఈ సమస్యను ఆయన ఎంతటి వివేకం, సమాలోచనం, ఉపాయంతో పరిష్కరించారంటే, తల పండిన అనుభవజ్ఞులు కూడా అబ్బుర పడకుండా ఉండలేకపోయారు. అరబ్బు తెగల్లో చెలరేగబోతున్న యుద్ధాగ్ని, ఈ పరిష్కారం మూలంగా ఆగిపోయింది, ఇంకా ఆయన (స)గారి విలువ, స్థానం ఎంతగా పెరిగిపోయాయంటే, పెద్దలు,

అనుభవజ్ఞులు సైతం తమ సున్నిత విషయాల్ని, చిక్కు సమస్యల్ని పరిష్క రించమని ఆయన(స)కు అప్పగించేవారు.

## వ్యాపార వ్యవహారాల్లో నీతి నిజాయితీల ప్రతిభ

ఆ కాలంలో మక్కాలో వ్యాపార వాణిజ్యాన్ని ఒక గౌరవప్రదమైన, శ్రేష్టమైన వృత్తిగా పరిగణించేవారు. అందుకని ప్రవక్త మహనీయులు (స) కూడా యవ్వనంలో అడుగుపెట్టగానే వ్యాపారాన్ని వృత్తిగా చేపట్టారు. నిజానికి ఆయన(స) వద్ద పెద్దపెట్టుబడేమీ లేదు. కాని ఆయనలోని మంచితనాన్ని, సత్యసంధతను, సత్ప్రవర్తనను మక్కావాసులంతా ఎరిగే ఉన్నారు. కనుక ఈ మంచితనమే, ఈ ఖ్యాతే ఆయన మార్గాన్ని సుగమం చేసింది. మక్కాలోని అనేక మంది వర్తకులు, వ్యాపారంలో ఆయనతో పొత్తుపెట్టుకొని పెట్టుబడి పెట్టటానికి సంసిద్ధులయ్యారు. ఆయన (స)గారు కష్టపడి, అత్యంత నిజాయితీతో వ్యాపారాన్ని సాగించారు. ఫలితంగా ఎంతో లాభంవచ్చేది. ఎవరితో పొత్తు గూడినా అతనికి లాభమే చేకూర్చారు. ఈ కారణంగా ఆయన్ను ఆహ్వానించేవారు. తమ వ్యాపారంలో పొత్తు కలువమని, తమ సరుకుల్ని అమ్మితెమ్మని కోరేవారే అధికమయ్యారు. ప్రతి వర్తకుడు ఆయనంటే ఇష్టపడే వాడు. ప్రతివాడు ఆయనతో సంతృప్తి చెందేవాడు. ఆయన(స) గారు ప్రతి ఒక్కరితో అత్యంత మర్యాదగా, నిజాయితీతో వ్యవహా రాలు నడిపేవారు. తానెక్కడికి వెళ్ళినా, ఏ వ్యాపారం చేసినా, సత్యాన్ని, న్యాయాన్ని, గౌరవ మర్యాదల్ని, నిజాయితీలనే కనబరిచేవారు.

ఆయనతో పొత్తు పెట్టుకొని వ్యాపారం చేసిన ఒక సహచరుడు అబ్దుల్లా ఇలా అంటారు: "వ్యాపార విషయంలో నేనాయన్ను ఒక చోట ఆపి, మీరిక్కడే ఉండండి, నేనిప్పుడే వస్తాన"ని చెప్పి వెళ్ళిపోయాను. పని భారంలో నేను ఈ విషయం మరిచిపోయాను. మూడవరోజు ఏదో అవసరం మీద అటుగా వస్తే, ప్రవక్త మహనీయుల్ని అక్కడ్నే నిరీక్షిస్తుండటం చూచి నేను నిర్ఘాంతపోయాను." మూడు రోజుల నిరీక్షణ గురించి కాస్త ఆలోచించి చూస్తే, గుడ్లు తేలేస్తాం.

కాని ఆయన (స) "అబ్దుల్లా! నీవు నన్ను బాగా బాధపెట్టావు. మూడు రోజుల్నుండి నేనిక్కడ్నే ఉన్నాను" అని మాత్రమే అన్నారు.

అరేబియాలో 'సాయెబ్' అనే పేరుగల ఒక వ్యాపారి ఉంటుండేవారు. ఆయన ఇస్లాం స్వీకరించి దైవప్రవక్త(స) వద్దకు వచ్చినప్పుడు, ప్రవక్త సహచరులు ఆయన్ను పొగుడుతూ పరిచయం చేశారు. దానిపై దైవప్రవక్త(స), "మీకంటే నేను ఆయన్ను బాగా ఎరుగుదును" అని సమాధానమిచ్చారు. ఇది విని సాయెబ్ "నా తల్లిదండ్రులు మీపై అర్పితం అగుదురుగాక! మీరు వ్యాపారంలో నాకు భాగస్వాములు. అయితే ప్రతినిత్యం వ్యవహారాన్ని మీరు సరళంగా, నిర్మలంగా ఉంచారు."అని సమాధానమిచ్చారు. హజ్రత్ ఖదీజా (రజి) మక్కాలో పేరుగాంచిన ధనికురాలు. ఆవిడ గారు ప్రవక్త మహనీయుల(స) సత్యసంధత, నిజాయితీల ఖ్యాతిని విని తమ వ్యాపారంలో భాగస్వామిగా చేరమని విన్నవించుకున్నారు. దానికాయన(స) అంగీకరించారు. ఈ వ్యాపారంలో ఆవిడ (రజి) గారికి అత్యధిక లాభం చేకూరింది. ఇదేగాక ఆయన (స)గారి సుగుణాలు, సౌశీల్యం, సత్ప్రవర్తనలతో ఆవిడ (రజి)గారు ఎంతగా ప్రభావితులయ్యారంటే, ఆయనకు(స) వివాహం కోసం తానే సందేశాన్ని పంపించారు. ఆ సమయంలో ప్రవక్త మహనీయులు (స) ఇరువై అయిదు సంవత్సరాలు, హజ్రత్ ఖదీజా(రజి) నలుభై సంవత్సరాల వయసులో ఉన్నారు. అంతేకాక ఆమె (రజి) వితంతువు. అనేక మంది పిల్లల తల్లి కూడాను. ఇది ప్రవక్త మహనీయుల(స) ఆత్మనిగ్రహానికి, నిరహంకారతకు ప్రబల నిదర్శనం. ఆయన(స) ఈ వివాహానికి సంసిద్ధులయ్యారు. హజ్రత్ ఖదీజా (రజి)తో వివాహం జరిగిన పదిహేను సంవత్సరాల పిదప దైవదౌత్య పదవికి ఎన్నుకోబడ్డారు. ఈ మధ్యకాలంలో ఆయన (స)గారి ప్రవర్తనలోని సౌశీల్యత, పరిశుద్ధత, నడవడికల్లోని ఉన్నత్వం సర్వ అరబ్బు దేశంలో వ్యాపిస్తూపోయింది.

# మొదటి దివ్యావిష్కృతి, మరియు హజ్రత్ ఖదీజా (రజి) గారి సమర్థన

ఆలోచించే, యోచించే గుణం ఏదైతే ఆయన వ్యక్తిత్వంలోనే నిబిడీకృతమై ఉండేదో, అది వయసు పెరిగిన కొద్దీ ఇనుమడించ సాగింది. ఆయన ఏకాంత జీవితాన్ని ఇష్టపడసాగారు. ఆయన (స) గారు హిరా అనే పర్వత గుహలో ఎన్నో రోజులు, వారాలు ధ్యానంలో నిమగ్నమయ్యేవారు. చివరికి దైవం తన దివ్యావిష్క ృతి (వహీ) ద్వారా ఆయన (స)కు సౌభాగ్యాన్ని ప్రసాదించాడు. తన పవిత్ర దూత అయిన హజ్రత్ జిబ్రయీల్ ద్వారా ఆయన (స)కు తన సందేశాన్ని అందించాడు. ఈ అనూహ్య సంఘటన వల్ల ఆయన భయభీతులై ఇంటికొచ్చేశారు. తన అర్ధాంగి అయిన హజ్రత్ ఖదీజా (రజి)కు ఈ విషయాన్ని తెలుపుతూ "నాకు ప్రాణభయముంది." అన్నారు. దానిపై హజ్రత్ ఖదీజా (రజి) ఆయన(స)ను ఓదారుస్తూ, ఏ మాత్రం లేదు, మీరు సంతోషించండి. దైవసాక్షిగా! దైవం మీకెన్నడూ నష్టపరచడు. (ఎందుకంటే) మీరు బంధువుల పట్ల మేలుగా ప్రవర్తిస్తారు. సత్యాన్నే పలుకుతారు.' కొన్ని ఉల్లేఖనాలలో ఇంకా ఈ వాక్యాలూ ఉన్నాయి. "అమానతుల్ని కాపాడి అప్పగిస్తారు. నిస్సహాయుల బరువును మోస్తారు. పేదలకు సంపాదించి పెడతారు. అతిథుల్ని సత్కరిస్తారు. ఇంకా సత్కార్యాల్లో భాగం పంచుకుంటారు" అంటూ ధైర్యం చెప్పారు.

దైవదౌత్యం లభించక ముందు ఆయన (స) గారి జీవితం ఎంత పవిత్రంగా, ఎంత సౌశీల్యంగా ఉండేదో, ఆయన నైతికాలు ఎంత ఉన్నతంగా ఉండేవో పై సంఘటన ద్వారా విదితమవుతుంది. హజ్రత్ ఖదీజా(రజి) ఓ బాలిక కాదు, ఆ సమయం వరకు ఆమె (రజి) వయస్సు యాభై అయిదు సంవత్సరాలు, అంతేకాక పదిహేను సంవత్సరాల సుదీర్ఘకాలం నుండి ప్రవక్త(స)కు అర్ధాంగిగా ఉంటూ వస్తున్నారు. భర్తలోని ఏ లోపం, ఏ బలహీనత కూడా భార్యవద్ద దాగి ఉండజాలదు. పదిహేను సంవత్సరాల ఈ దాంపత్య

జీవితంలో హజ్రత్ ఖదీజా(రజి) ప్రవక్త మహనీయుల్ని ఎంతటి ఉన్నత స్థానంలో కనుగొన్నారంటే, దైవప్రవక్త(స) హిరా పర్వత గుహలో తనతో జరిగిన సంఘటనను గురించి తెలుపగానే ఆమె(రజి) ఎలాంటి సంకోచం లేకుండా, ఆయన(స)గారి వద్దకు దివ్యాష్కృతి (వహీ)ని తీసుకవచ్చిన వారు నిస్సందేహంగా దైవదూతయే అని సమర్థించారు.

ఇక ఎప్పుడైతే ఆయన్ను (స) క్రైస్తవ పండితుడైన వరఖా బిన్ నోఫిల్ వద్దకు తీసుకుపోయారో, వరఖా కూడా వెంటనే ఆయన(స) దైవదౌత్యాన్ని దృవీకరించారు. వరఖా బిన్ నోఫిల్ కూడా చిన్నప్పటి నుండి ఆయన(స) గారి జీవితాన్ని చూస్తునే ఉన్నారు. హజ్రత్ ఖదీజా (రజి)తో వివాహం తరువాత, సమీప బంధుత్వం కారణంగా ఆయన స్థితిగతులతో ఇంకా అధికంగానే అవగాహన కలిగి ఉన్నారు. వరఖా దృష్టిలో కూడా ఆయన(స) ఒక మహోన్నత, సౌశీల్యవంతుడైన మనిషి. అందుకే ఆయన్ను (స) దైవప్రవక్తగా విశ్వసించటంలో ఆయన ఏ మాత్రం సందేహించలేదు.

ఈ పవిత్రత, నీతినిజాయితీల కారణంగానే, దైవదౌత్య ప్రారంభ కాలంలో ఖురైష్ నాయకులు ఆయన్ను(స) వ్యతిరేకిస్తున్న సమయంలో, వారిలోని ఒక ప్రముఖ నాయకుడైన నజర్ బిన్ హారిస్, వారిని ఖండిస్తూ ఇలా అన్నాడు. "ఖురైషీయులారా! ముహమ్మద్ మీ ముందు బాల్యం నుండి యవ్వనానికి ఎదిగాడు. అతను మీ కన్నా అధికంగా ప్రేమించబడే సత్య సంధుడు, నిజాయితీ పరుడు. అప్పుడైతే మీరెలాంటి అపనమ్మకాన్ని ప్రదర్శించ లేదు. కాని ఇప్పుడు అతని తల వెంట్రుకలు తెల్లబడుతున్న ఈ సమయంలో మీరతన్ని మాంత్రికుడు, తాంత్రికుడు, కవి అని చెబుతున్నారు. దైవసాక్షిగా! అతనీ సర్వ అపవాదుల నుండి పరమ పవిత్రుడై ఉన్నాడు."

ఖురైషీయులు ఆయన్ను తిరస్కరించినప్పుడు, ఆయన స్వయంగా చెప్పింది కూడా ఇదే. "ఖురైషీయులారా! దైవదౌత్యం కన్నా ముందు గడచిన నా జీవితం మొత్తం మీ ముందున్నదే! మీరేమీ ఆలోచించరా?"

## సత్యాసత్యాల మధ్య ఘర్షణ

దైవదౌత్య ప్రకటనకు పూర్వం, ఖురైషీయుల మధ్య గడిపిన ఆయన నలభై సంవత్సరాల సుదీర్ఘ జీవితంలో ఆయన ఎన్నడూ అసత్యమాడి ఎరుగరు. ఎవరినీ దగా, మోసం చేయలేదు. స్వప్రయోజనం కోసం ఎలాంటి అన్యాయ, అక్రమాలకు పాల్పడలేదు. ఇదంతా వారు తమ కళ్ళతో తిలకించారు. దీన్ని తృణీకరించటం వారికి అసంభవం. ఆయన యుక్తిజ్ఞానాల్ని, సత్ప్రవర్తనను, ఉన్నత నైతికతల్ని అంగీకరించటమేకాదు, స్వయంగా వారే పొగిడేవారు కూడాను. జీవిత సర్వ వ్యవహారాల్లో సత్య సంధుడు, నిజాయితీపరుడు అయిన ఆయన ఒక్క దైవ విషయంలో మాత్రమే (దైవం క్షమించుగాక) అసత్యవాది అని ప్రజలను నమ్మించటం వారికి అసాధ్యమై పోయింది. ఇతరత్రా అనేక సాకుల్ని, ఆరోపణల్ని ఆయనకు ఆపాదించినా, సామాన్య ప్రజలే కాదు, స్వయంగా వారి ఆత్మలు సైతం ఈయన్ను అసత్యవాదిగా నమ్మటానికి సహకరించటం లేదు.

ఇదే కారణంగా మౌలానా మౌదూది (రహ్మ)గారు పేర్కొన్నట్లు, దైవదౌత్య ప్రకటన తరువాత మక్కాలోని దుర్వర్తనులు, అవినీతిపరులు తరచుగా ఆయనకు వ్యతిరేకంగా ప్రచారం చేస్తుండేవారు. వారి బృందాలు హజ్ కాలంలో, సర్వ అరబ్బు దేశం నుండి వచ్చే యాత్రికుల బిడారాలకు వెళ్ళి వారిని హెచ్చరించేవారు. ముహమ్మద్ (స) పేరుగల ఒక ప్రమాదకరమైన వ్యక్తి ఇక్కడ బయల్పడ్డాడని, ప్రజలపై మంత్రప్రభావం వేస్తాడని, ఫలితంగా తండ్రి కొడుకులు, భార్యాభర్తలు, అన్నదమ్ముల మధ్య ఎడబాటు పొడసూపుతుందని, అందుకని అతనితో కాస్త జాగ్రత్తగా మసలుకోవాలని వారిని బెదిరించేవారు. ఇలాంటి మాటలే వారు హజ్ కాలంలోకాక సామాన్య సమయాల్లో దర్శనం కోసమో, లేక వేరేదైనా పనిమీదనో మక్కా వచ్చిపోయే ప్రజలకు కూడా పని కట్టుకొని నూరిపోసేవారు. ఈ విధంగా దైవప్రవక్త (స)ను వారు అపఖ్యాతి పాల్జేసేవారు. కాని దీని ఫలితం ఎలా బయల్పడిందంటే, సర్వ అరబ్బుదేశంలో

ఆయన పేరు మారోగిపోయింది. మక్కాలో మాత్రమే పరిచితుడైన ఆయన్ను, వీరే స్వయంగా అరబ్బుదేశంలోని అన్నితెగల్లో పరిచయం చేశారు. ఆ మనిషి ఎవరు? అతను అనేదేమిటి? అతనెటువంటివాడు? అతని మంత్రాలతో ప్రభావితమైన వాళ్ళెవరు? ఈ మంత్ర ప్రభావం వారిపై ఎలా పడింది? ఇత్యాది విషయాలు తెలుసుకోవాలనే జిజ్ఞాస, ఉత్సాహం ప్రజల్లో ఏర్పడటం సహజమే కదా!

మక్కా అవిశ్వాసులు ఈ దుష్ప్రచారాన్ని ఎంత తీవ్రతరం చేశారో, ప్రజల్లో ఈ విషయాన్ని తెలుసుకొనే జిజ్ఞాస, ఆతృత అంతే తీవ్రం కాసాగింది. ఈ జిజ్ఞాస, ఆతృతలతో ప్రజలు ఆయన్ను గురించి పరిశోధించినప్పుడు, ఆయన (స) సత్ప్రవర్తన, సత్యసంధత, నీతి నిజాయితీలు తెలిసిపోయేవి. దానితో పాటే ఆయన (స) చేస్తున్న బోధనలు ఏమిటో ప్రజలకు తెలిసి పోయి నప్పుడు, ఈ తప్పుడు ప్రచారమే ఆయన(స) సందేశ వ్యాప్తికి ఒక ప్రముఖ సాధనంగా మారిపోయేది. ఆయన(స)లోని దైవభీతి, సత్యసంధత, సత్ప్రవర్తన, సక్రమమైన వ్యవహారశైలి, న్యాయధర్మాలు, మానవ సమానత్వం, దయా దాతృత్వాలు, పేదలకు సహాయ సహకారాలు, వాగ్దాన పాలన, వ్యవహారాల్లో నిజాయితీ ఇత్యాది విషయాల్ని ప్రత్యక్షంగా, ఆచరణాత్మకంగా చూడగానే వారి హృదయాలు కరిగిపోయేవి. వెంటనే వారు ఇస్లాం స్వీకరించే వారు.

## ఇస్లాం స్వీకరించిన వారి ఆదర్శనీయమైన ప్రవర్తన

ఇక ఇస్లాం స్వీకరించిన వారు కూడా దాని పట్ల సమ్మోహితులైపోయే వారు. దాని ఆదేశాల్ని మనఃపూర్వకంగా స్వీకరించి నిండు మనస్సుతో ఆచరించేవారు. ఏ విషయాల నుండి దైవప్రవక్త (స) వారించేవారో వారు దాని నుండి వెంటనే ఆగిపోయేవారు. మనసెంత లాగినా ఆయన (స) గారి ఆదేశా లను ఉల్లంఘించేవారు కాదు. మధుపానమంటే వారికి ప్రాణం. కాని దైవప్రవక్త(స) ఒక్క ఆదేశంతోనే దానికి వారు శాశ్వతంగా దూరమైపోయారు. జూదం అంటే పడి చచ్చేవారు. వడ్డీవ్యాపారం వారికి ప్రీతిపాత్రమైనది. కాని

ప్రవక్త మహనీయుల(స) సాంగత్యంలోకి రాగానే, సారాపాత్రల్ని పగులగొట్టారు, వడ్డీ వ్యాపారాల్ని మానుకున్నారు. విచ్చల విడిగా నలుగురి ముందు తిరుగాడే స్త్రీలు, పరపురుషుల నుండి పరదా పాటించసాగారు.

క్లుప్తంగా చెప్పాలంటే, వారి ఆలోచనా సరళి, వారి ఈచ్ఛాకోరికలు, వారి అలవాట్లు, అభిరుచులు, వారి మిత్రశతృత్వాలు,వారి నైతిక ప్రమాణాలు అన్నీ మారిపోయాయి. ఇంతకు ముందు, దొంగలు దోపిడీదార్లుగా ఉంటుండే వారు ఇక్కడి వచ్చి ప్రజల ధన మాన ప్రాణాల సంరక్షకులుగా మారిపోయారు. వ్యభిచారం లాంటినేరం తమద్వారా జరిగిపోయినా, కఠినాతికఠిన శిక్షను ఎదుర్కోవటానికి సంసిద్ధులై హాజరయ్యారు. వడ్డీ ద్వారా తమ ధనాన్ని పెంపొందించుకొనే పిసినారులు దైవమార్గంలో తమ ధనాన్ని వెచ్చించేటంత ఉన్నత స్థాయికి ఎదిగారు. దురహంకార పూరితులైన వీరిలో వినయ వినమ్ర తలు మూర్తీభవించాయి. తుంటరి, పోకిరి, దుర్మార్గులైన వీరు అత్యంత దైవ భీతిపరాయణులుగా, సచ్ఛలవర్తనులుగా మారిపోయారు. దౌర్జన్యాలకు పాల్పడేవారు, కలతల్ని రేకెత్తించేవారు ప్రజల సంరక్షకులుగా, శ్రేయోభి లాషులుగా మారిపోయారు. బానిసలు, బానిసరాండ్రుల్లో నుండి, అసమాన ధైర్యసాహసాలతో, అనుపమ త్యాగనిరతితో ఇస్లాం అమానతును తమ హృదయాల్లో దాచుకొని, చివరికి ప్రాణాల్ని సైతం ధారపోసిన ధీరోదాత్తులు బయల్పడ్డారు. ఎంతటి త్యాగం చేయాల్సి వచ్చినా వారు వెనుకాడలేదు, అధైర్యపడలేదు. తరతరాలుగా వస్తున్న తమ ఆలోచన, ఆచారాలను, సాంప్ర దాయాలను త్యాగం చేశారు. అనుచితమైన, అక్రమమైన తమ మనోవాంఛ లను త్యాగం చేశారు. రంగు, సంతతి, వంశం, జాతి పరమైన అజ్ఞాన కాలపు వివక్షల్ని, బేధభావాల్ని త్యాగం చేశారు. తమ సౌఖ్యాన్ని, తమ ధన మాన ప్రాణాల్ని, తమ భవిష్యత్తును సర్వాన్ని త్యాగం చేశారు. తమ ఇల్లూవాకిల్ని, తమ నివాస స్థలాల్ని, తమ ఊరిని, దేశాన్ని సైతం వారు త్యాగం చేశారే తప్ప, ధర్మాన్ని విడనాడలేదు. అసామాన్యమైన, అనుపమమైన, సాటిలేని ఈ త్యాగ నిరతిని, ఈ ధీరత్వాన్ని చూసి సామాన్య ప్రజలేకాదు, వారిపై దౌర్జన్యం

చేస్తున్నవారు, వారిని అవహేళన పరుస్తున్నవారు సైతం ఆశ్చర్యచకితులై పోయారు. అవాక్కైపోయారు, నిర్ఘాంతపోయారు. వారి మనసులు బెదిరి, చెదిరి పోయాయి. చివరికి ఈ సత్యసందేశం ఒక్కొక్కటిగా అందరి హృదయాల్లో తన స్థానాన్ని పదిలపర్చుకోవటంలో కృతార్థమయింది.

## విజయ రహస్యం

పై వివరణల వల్ల ఒక విషయం తేటతెల్లమౌతోంది. ఏ సిద్ధాంతమైనా, సందేశమైనా, ఉద్యమమైనా, అది ప్రజల ఆలోచనా సరళిని, వారి అలవాట్లను, అభిరుచుల్ని మార్చాలన్నా; తాను కోరే స్థాయికి ప్రజల్ని తేవాలన్నా; దాని అనుయాయుల యొక్క ప్రవర్తన, నడవడికలు, శీలం ప్రముఖ పాత్రను పోషిస్తాయి. అవి లేకపోతే ఆ ఉద్యమం ముందుకు సాగదు. నైతిక ప్రవర్తన అనేది అనివార్యం. ప్రజల ధార్మిక, నైతిక, సామాజిక సంస్కరణ కోసం కేవలం కొన్ని ఆదేశాలిచ్చి, కొన్ని ప్రసంగాలు చేసి ఊరుకుంటే ఎంత మాత్రం సరిపోదు. దీనికి భిన్నంగా ప్రవక్త మహనీయులు (స) మక్కా నగరంలోని తన జీవితంలో తన వాక్కర్మల ద్వారా, తమ వ్యవహారాల ద్వారా, తమ వ్యవహారాల ద్వారా, తమ నైతికతల ద్వారా, తమ వ్యక్తిగత జీవితంలోని ఒక్కొక్క చర్య ద్వారా ఎలాగైతే ఈ సందేశాన్ని పరిచయం చేశారో, అలా చేయక తప్పదు. ఈ ధర్మం ఎలాటి నైతికతల్ని కోరుకుంటుంది, ఎలాంటి మానవుల్ని రూపొందించ దలుస్తుంది, ఎలాంటి ప్రవర్తనను అభిలషిస్తుంది? ఇస్లాంను విశ్వసించి అవలంబించిన వ్యక్తి, ఈ ప్రపంచంలో ఎలాంటి జీవనం గడపాలని అది కోరుతుందో, అది ప్రత్యక్షంగా కనబడాలి. ప్రజలు తమ కళ్ళతో అలాంటి వ్యక్తుల్ని చూడగలగాలి. అందుకోసమనే ప్రవక్త మహనీయులు (స) ప్రజల్ని తమ నోటితో చెప్పటం కాదు, దానిపై తాను స్వయంగా ఆచరించి మరీ చూపించారు. తన బోధనలకు ఆయనే (స) స్వయంగా ఆదర్శంగా, నిదర్శంగా నిలిచారు. ఆయన(స) అనుచరులు, అనుయాయులు కూడా ఈ పద్ధతినే అవలంబించారు.

ఇదేవిధంగా నేడు కూడా ఎవరైనా ఇస్లాంను ప్రేమించి ఉన్నట్లయితే, అతని హృదయంలో ఇస్లాంపట్ల, ఈ ధర్మం పట్ల సానుభూతే గనుక ఉండి ఉన్నట్లయితే, ఈ సత్య సందేశాన్ని అతను ప్రపంచానికి, ప్రపంచ ప్రజలకి అందజేయాలని, అశ్రద్ధ, ఏమరుపాటుతో ఉన్న ప్రజల్ని సంస్కరించ దలుచుకుంటే, మొట్టమొదటగా అతని జీవితంలో ఈ సందేశ ప్రభావం ప్రతి బింబించాల్సి ఉంటుంది. ఏ సందేశాన్నైతే అతను సత్యమైనదని, సముచిత మైనదని, సర్వమానవశ్రేయానికి అనివార్యమైనదని భావిస్తున్నాడో, విశ్వసిస్తు న్నాడో, ముందుగా తాను దాన్ని ఆచరించి చూపాలి. దాని బోధనలు అతని జీవితంలో తొణికిసలాడాలి. అది ప్రతిపాదించే నైతికతల్ని అతను అలవర్చు కోవాలి. దైవంతో సంబంధాన్ని గట్టి పరుచుకోవాలి. అతని ఒక్కొక్కొ కదలిక దైవారాధన మరియు దైవదాస్యంతో ప్రభావితమై ఉండాలి. అతను ఆపాద మస్తకం ఒక నిజమైన దైవదాసునిగా, దైవేచ్ఛకు సంతృప్తుడైనట్లు కనబడు తుండాలి. అతను కేవలం చెప్పేవాడేకాదు, చేసిమరీ చూపించేవాడై ఉండాలి. అతనిలో ఆ ధార్మిక గుణగణాలుండాలి. అతను సత్యసంధుడు, నిజాయితీ పరుడై ఉండాలి. భయప్రలోభాలకు లొంగని వాడై ఉండాలి. తన పద్ధతుల్లో రాజీపడని వాడు, తన వ్యవహారాల్లో స్వచ్ఛమైనవాడై ఉండాలి. న్యాయ నిర్ణయంలో స్వపర అనే బేధాన్ని పాటించనివాడై ఉండాలి. సత్యాన్ని సత్యం గాను, విధిని విధిగానే భావించేవాడై ఉండాలి. సమ్మతింపబడిందేదో, నిషే ధింపబడిందేదో, అహర్నిశలు గుర్తుంచుకోగలిగిన వాడై ఉండాలి. అంతేకాక.

ఒక్క దైవం ముందు తప్ప అతనేశక్తికి తలవంచనివాడై ఉండాలి.

ఒక్కదైవం ముందు తప్ప వేరెవరి ముందు చేయిచాచని వాడై ఉండాలి.

ఒక్క దైవ భయం తప్ప, ఏ ఇతరుని భయం అతని హృదయంలో స్థానం పొందకూడదు. అతని నైతికతలు, అతని ప్రవర్తన, అతని వ్యవహార శైలిని చూడగానే ప్రజలు ఒక్కచూపులోనే, అతను యే సందేశంతో యే సిద్ధాంతంతో దేవుని వైపుకు పిలుస్తున్నాడో తెలుసుకోగలగాలి.

## సందేశ ప్రచారకుని ఆచరణ శూన్యత వల్ల ఒనగూడే దుష్ఫలితాలు

దీనికి భిన్నంగా ఎవరైనా ఓ వ్యక్తి ధార్మిక సందేశ ప్రచార నిమిత్తం నిలబడ్డాడనుకోండి. ధార్మిక సందేశాన్ని తీసుకొని, ప్రపంచ ప్రజల వద్దకు పోయి, వారిని వారియొక్క అశ్రద్ధ, ఏమరుపాటును తెలియపరచ ప్రయత్నిస్తున్నాడు. కాని అతని స్వజీవితమే అతని సందేశ ప్రభావాలతో శూన్యమైఉంది. అతని జీవితంలో దాని ప్రభావం ఏమీ కనబడడంలేదు. అప్పుడేమవుతుంది? అతని మాటల్లో, అతని వాదనలో ఏదైనా ప్రభావముంటుందా? అతని సందేశం హాస్యాస్పదం కాదా? సందేశాన్ని ఇతరుల వద్దకు తీసుకుపోయి, దీన్ని స్వీకరిస్తే ఇహపరాల్లో సాఫల్యం పొందుతారని చెబుతున్న వ్యక్తే దాన్ని అనుసరించటం లేదు. దాన్ని ఆచరించటం లేదు అని అంటే ఆ సందేశంపై అతని కసలు విశ్వాసమున్నట్లా? లేనట్లా? దానిపట్ల అతనికి గట్టి విశ్వాసమే ఉండి ఉన్నట్లయితే మరి తానేందుకు ఆచరించటం లేదు. ఆ బోధనలకు తన నిజజీవితంలో స్థానమివ్వటం లేదెందుకని? అలాంటి సందేశాన్ని ప్రజలెవరైనా విశ్వసిస్తారా? సందేశప్రచారకుని జీవితంలో దాని ఆచరణలేదు. అతని నైతికతలు, ప్రవర్తన దానికనుగుణంగా లేదు. అతని ప్రవర్తనలో, జీవితంలో లోపాలూ, మచ్చలూ ఉన్నాయి. అతని సత్యసంధతలో విశ్వసనీయత లేదు. అతని వ్యవహారశైలి సక్రమంగా, సరళంగాలేదు. అలాంటప్పుడు ప్రజలు అతని మాటను ఎందుకు పట్టించుకుంటారు? అతన్ని అల్పునిగా, నీచునిగా, శీలంలేని వానిగా మాత్రమే గుర్తిస్తారు. ఇలాంటి వ్యక్తి పరలోక జీవితంలో కూడా తీవ్ర పరాభవానికి గురికాక తప్పదు. ఇతరులకు హితబోధ చేస్తూ, మంచిని అవలంబించమని, చెడును విడనాడమని, మద్యపానం సేవించరాదని, అసత్యం పలకకూడదని చెప్పనైతే చెప్తున్నాడు కాని, తాను మాత్రం వీటిని విడిచిపెట్టటం లేదు. నిజజీవితంలో ధర్మంపట్ల తిరుగుబాటు వైఖరిని అవలంబిస్తున్నాడు. ఇలాంటి వ్యక్తంటే దైవానికి అత్యంత అసంతృప్తి కలుగు

తుంది. అతను దైవాగ్రహానికి గురికావలసి వస్తుంది. ఈ కారణంగానే దివ్య ఖుర్‌ఆన్‌లో విశ్వాసుల్ని సంబోధిస్తూ దైవం ఇలా హెచ్చరిస్తున్నాడు.

> "విశ్వాసులారా! మీరు చేయనిదాన్ని గురించి ఎందుకు మాట్లాడు తున్నారు. చేయని దాన్ని గురించి చెప్పుకోవడం దేవునికి చాలా అప్రియమైన విషయం." (అస్సఫ్-3)

## ముస్లింల దయనీయ స్థితి

పై ఆయతును దృష్టిలో పెట్టుకొని, ముస్లింల పరిస్థితిని పరిశీలించి నట్లయితే వారిలోని అత్యధికులు ధర్మానికి సంబంధించిన మౌలిక విషయాల జ్ఞానాన్ని కలిగి ఉన్నప్పటికి, నిజజీవితంలో వారు ధర్మాన్ని ఆచరించటం లేదు. ఉదాహరణకు ఐదుపూటలా నమాజ్ చేయడం, రమజాన్‌లో ఉపవాసాలు పాటించడం ముస్లింల విధి అని వారికి తెలిసినప్పటికీ అత్యధికులు నమాజ్ చేయడమే లేదు, ఉపవాసాలు పాటించడమే లేదు. జకాత్ చెల్లించటం విధి అని, ధార్మిక సౌధంలో ఇదో ముఖ్య స్థంభమని తెలిసినా, దాన్ని చెల్లించటం లేదు. ఇస్లామీయ ధర్మంలో లంచాలు స్వీకరించటం నిషేధితమని, అసత్యం పలకటం గొప్ప పాపమని వారికి తెలిసి ఉన్నప్పటికీ దాన్ని విడనాడరు. పిన్నలు, పెద్దలు, జ్ఞానులు అజ్ఞానులు, పీర్లు ఫఖీర్లు, హాఫిజ్‌లు మౌల్వీలు ఒక్కరని ఏమి? అందరూ దీంట్లో కూరుకుపోయినవారే! వారి నమాజ్‌లు, వారి ధర్మం, వారి వేషం, వారి మాటలు అన్నీ బూటకాలే! దైవమే మాకు భుక్తిని సమకూర్చేవాడు అని నోటితోనైతే అంటారు కాని, హృదయంలో ఈ విషయం దిగిపోలేదు. ఇహంకంటే పరలోకమే శ్రేష్టమైనది, శాశ్వతమైనది అని అననైతే గాని, ప్రపంచాన్ని కూడబెట్టటంలో ఆమోదిత, నిషేధిత మార్గాల భేదభావాన్ని మరిచిపోయారు. మనమంతా తప్పకుండా మరణించ వలసిన వారమే అని చెప్పనైతే చెప్తారు కాని, మనం చచ్చేది లేదన్నంతగా ప్రపంచ సంపాదనలో మునిగిపోతారు. నోటితోనైతే ఇస్లాం, ఇస్లాం అని తెగపొగడుతుంటారు. కాని ఆచరణలో చిత్తశుద్ధి లేదు. షరీఅత్‌ను పట్టించుకోవటంలేదు. జూదం జోరుగా

సాగుతుంది. వ్యభిచారం, అశ్లీలం, నగ్నత్వం, పరపురుషులతో కలిసి తిరగటం సర్వ సామాన్యమైపోయింది. నిస్సంకోచంగా మద్యపానాన్ని సేవిస్తున్నారు. నిర్లజ్జగా వడ్డీ వ్యాపారం చేస్తున్నారు. మనసు కోరిన ప్రతి విషయాన్ని, అది నిషేధితమైన (హరాం) దైనా సరే, మనోకాంక్ష మేరకు నెరవేర్చుకుంటున్నారు. ఇలాంటి పరిస్థితుల్లో వారు గౌరవోన్నతులు ఎలా పొందగలుగుతారు?

ఒక ముస్లిమేతరుడు అజ్ఞానం వల్ల, పరలోకంలో దానికి పడబోయే శిక్షేమిటో తెలియకపోవటం వల్ల తూకంలో తగ్గించి ఇస్తున్నాడు. మోసగిస్తున్నాడు. కాని ఒక ముస్లిం ఈ విషయాలన్నీ తెలిసిన తరువాత కూడా తూకంలో మోసగిస్తున్నాడు, మద్యపానం సేవిస్తున్నాడు, లంచాలు తీసుకుంటున్నాడు. వడ్డీని నడుపుతున్నాడంటే మరి భేదమేముంటుంది? సత్యధర్మాన్ని స్వీకరించటం వల్ల ఇలాంటి సత్పురుషులు తయారవుతారనే దానికి సాక్ష్య మెక్కడి నుండి వస్తుంది? ప్రపంచం ఇస్లాంను దాని గ్రంథాల్లో కాదు, ముస్లింల ప్రవర్తనలో చూస్తుంది. నేడు వీరి ప్రవర్తన, వీరి మాటను, వాదనను ఖండిస్తున్నది. సత్యసందేశ స్వీకరణలో ఈ వ్యవహారం ఒక గొప్ప అడ్డంకిగా మారింది. ముస్లింలు ఎంతో అర్భాటంతో, ప్రతి రోజు కొత్త కొత్త సంఘాలను, ఉద్యమాలను చేపడుతున్నారు. విరాళాలు వసూలవుతున్నాయి. పార్టీలు, సంస్థలు ఏర్పడుతున్నాయి. మస్జిద్‌లలో ప్రసంగాలు, హితబోధల సమా వేశాలవుతున్నాయి. అడుగడుగుకు ధార్మిక పాఠశాలల్లో, విద్యాలయాల్లో ఖుర్‌ఆన్, హదీస్‌ల పాఠాలు వల్లించబడుతున్నాయి. ప్రజలు వ్యయప్రయాసల కోర్చి, మూటాముల్లెలు నెత్తిపై ఎత్తుకొని, ఊరూరా తిరుగుతున్నారు. అయినా కూడా వీటన్నిటి వల్ల ఏ ప్రభావమైతే పడాలో, ఏ ఫలితాలైతే రావాలో, అవి కనబడటం లేదు. ఇంతటి వ్యయప్రయాసల తరువాత కూడా పరిణామాలేమీ కానరావటం లేదు. ముస్లింలలో ధనికులూ ఉన్నారు. ముస్లిం రాజ్యాలూ ఉన్నాయి. కాని ప్రతిచోట వారి బలహీనతే ప్రముఖంగా కనబడుతున్నది. వారు అపజయాలపై అపజయాల్ని ఎదుర్కొంటున్నారు. లెక్కకు మిక్కుటంగా నిర్దయతో వధించబడుతున్నారు. దీనికంతటికి ఒక అసలైన కారణముంది.

విశ్వాసం, ఇస్లామీయ ధర్మం, దైవంతో విశ్వాసులకుండవలసిన ఆ విశ్వస నీయత లేకపోవటమే దీనికి అసలు కారణం. ఒకప్పుడు దైవం పట్ల, ధర్మం పట్ల సంపూర్ణ విశ్వాసమే ముస్లింల విశిష్టత అయి ఉండేది. ఆ ప్రత్యేకతే ఆ విశిష్టతే నేడు కనుమరుగైపోయింది.

## ముస్లింల బాధ్యత

ఓ ముస్లిమ్ బాధ్యత ఏమిటి? ప్రవక్త మహనీయులు(స) దేనికోసం అతన్ని నిలబెట్టారు? దైవప్రవక్త(స) ఈ ప్రపంచం నుండి నిష్క్రమించిన తరువాత అతనే బాధ్యతను చేపట్టాల్సి ఉంది అనే విషయాన్నే ముస్లిం మరిచి పోయాడు.

ప్రపంచంలోని ఇతర ప్రజల్లాగా, ఇతర మానవుల్లాగా, ఇతర జాతుల్లాగే తను కూడా ఒకడినని భావిస్తున్నాడు. అసలీభావన నుండి ముందు ముస్లింలను మేల్కొలపాల్సి ఉంది. వారి ఆలోచనా విధానాన్ని మార్చాల్సి ఉంది. వారి జీవిత ధ్యేయాన్ని తెలుపాల్సి ఉంది. వారొక అనుచరగణమని, దైవ సందేశ అమానతు భారాన్ని కలిగి ఉన్న బృందమని, ఇస్లామీయ ధర్మ సందేశవాహకులని వారికి నొక్కి చెప్పాల్సి ఉంది. నిరాశ నిస్పృహల్లో, ఆపదల తుఫానుల్లో వారు ఆశాజ్యోతి అని, చెడులు, రుగ్మతల పెనుగాలులు ఇంతకు ముందు కూడా వీచాయని, హింసాదౌర్జన్యాలు, దుర్మార్గాలు ఇంతకు మునుపు కూడా అనేక సార్లు ఈ ప్రపంచాన్ని చుట్టుముట్టాయని, ద్వేష జ్వాలల్లో మానవుడు ఇంతకు ముందు కూడా కాల్చివేయబడ్డాడని వారికి తెలియజేయాల్సి ఉంది. అయితే ఈ ద్వేషాగ్నిని చల్లార్చిన వారు కూడా మానవులేనని, మృగాలుగా మారిన తన స్నేహితుల్ని, వారు సంస్కరించి తిరిగి సత్పురుషులుగా మార్చారని, ఇస్లామీయ సందేశాన్ని వారికి వినిపించి, ప్రేమ సౌభ్రాతృత్వాల నందన వనాలను వికసింపజేశారని వారికి హితబోధ చేయాల్సి ఉంది.

మానవాళి కోసం, వారి శ్రేయస్సు కోసం అన్నిటికన్నా పవిత్రమైన, మేలైన, అన్నిటిలోకెల్ల మధ్యస్థమైన జీవన వ్యవస్థ కేవలం ఇస్లాం వద్దనే

ఉందనేది వాస్తవం, యదార్థం కూడా. ఇంతకన్నా మేలైన జీవన వ్యవస్థ ఏ ఇతర జాతివద్ద కూడా లేదు. దైవప్రవక్తలు తమ తమ కాలాలలో దీన్ని ఆచరించి మరీ చూపించిన సక్రమ జీవన వ్యవస్థ ఇది. దీని ద్వారానే మానవత్వం శాంతి, సౌఖ్యాలను పొందగలిగింది. నేడు కూడా ఈ పెన్నిధి లభించిన వాడు ప్రపంచంలోకెల్లా అత్యంత సఫలీకృతుడైన మానవుడు. దేవుని ఈ ధర్మాన్ని ఎవరైతే ఆశ్రయించారో, మానవ సమూహంలో అతనికి మించిన అదృష్టవంతుడు వేరొకడు లేడు.

ఇన్ని దైవ కరుణాకటాక్షాలు పొందిన తరువాత కూడా ఒక వ్యక్తి, దైవానికి అసంతృప్తి కలిగించే పనులు చేయటం అతనికి ఎంత మాత్రం శోభించదు. షైతాన్ శిష్యులు ఏ మార్గంపైనైతే అతన్ని తీసుకుపోదలిచారో దానిపై పయనించటం అతని హోదాకు తగిన విషయం కాదు. అతని పరలోక జీవితం నాశనమయ్యే జీవిత వ్యవస్థను ఎన్నుకోవటం అతని అవివేకానికి పరాకాష్ట అనబడుతుంది.

## చివరి దైవ దృఢ సంకల్పం

గడచిన ఎన్నో సంవత్సరాలు మనం ఈ అశ్రద్ధలోనే, ఏమరుపాటులోనే గడిపివేశాం. కాని మన పలుకు, ఆచరణలో గల ఈ వ్యత్యాసాన్ని దూరం చేసుకునే సమయం ఆసన్నమైంది. మన ధర్మాన్ని పూర్తి జ్ఞానం మరియు నిర్మలత్వంతో అవలంబించాల్సి ఉంది. మన నైతికతా ప్రవర్తనల్లోను, మన సామూహిక ప్రవర్తనలోను స్వచ్ఛమైన, కలుషితంగాని ఇస్లామీయ ధర్మాన్ని ప్రదర్శించాల్సి ఉంటుంది. మన జాతి అంతా కూడా ఈ ధర్మం కోసమే జీవించే, ఈ ధర్మం కోసమే మరణించే గట్టి నిర్ణయం తీసుకోవాల్సి ఉంటుంది. ఈ ప్రపంచంలో, ఈ భుమ్మీద మన జాతి దైవ వచనాన్ని ఉన్నత పరిచే విషయాన్నే గనుక తన జీవిత ఏకైక లక్ష్యంగా ఎన్నుకుంటే, దీని నైతికత ఔన్నత్యాన్ని ప్రపంచం అంగీకరించకుండా ఉండడం అసాధ్యం. ఈ సందేశ ప్రభావం మానవ హృదయాల్ని పులకరింపజేయకుండా ఉండటం అసాధ్యం.

ప్రపంచ నలుమూలల్లో శాంతి సామరస్యాల చల్లని గాలులు వీచకుండా ఉండజాలవు. దాసుడు తన ప్రభువును ప్రసన్నం చేసుకోవటానికి శక్తివంచన లేకుండా ప్రయత్నిస్తున్నప్పుడు, సౌభాగ్యమేఘాలు అతన్ని ఆవరించటానికి ఎంతో సేపు పట్టదు. ఇస్లామీయ ధర్మంపట్ల, తమ విశ్వాసం పట్ల, దైవంపట్ల విశ్వసనీయతలో పటుత్వమే గనుక వచ్చిందంటే, ఈ విషయంలో దృఢ సంకల్పమే గనుక చేసుకొని ఉంటే, విజయాల పరంపరలు ఎగిరెగిరి వచ్చిపడతాయి. దైవం ఇలా వాగ్దానం చేస్తున్నాడు:

> "విశ్వాసులారా! మీరు అల్లాహ్‌కు సహాయం చేస్తే, ఆయన మీకు సహాయం చేస్తాడు, మీ పాదాలను స్థిరంగా ఉంచుతాడు." (ముహమ్మద్-7)

వాగ్దాన పాలనలో దైవాన్ని మించి ఇంకెవరినైనా ఊహించ సాధ్యమేనా??

**(సమాప్తం)**